# సెలవుల్లో ......

"అబ్బ ! ఈ రోజునుంచీ యిక సెలవులు" అనుకున్నాడు గోపీ.

"ఒరేయ్ ! లేచి ముఖం కడుక్కో—" అమ్మ అరచింది.

"ఉండవే ! సెలవుల్లో కూడా నిద్ర పోరాదేంటి ?"

"ఐతే, ఈ దినమంతా అలాగే నిద్రపో. నీవూ కుంభకర్ణుడిలా ఓ మొద్దువౌతావ్ !" కసిరింది అమ్మ.

"అదికాదే, మరేమో మా సైన్సు మాస్టారు చెప్పారు – నిద్రపోతే బాగా విశ్రాంతి చేకూరి బలం వస్తుందని"

"అందుకేరా రాత్రంతా నిద్రపోవడం. మీ మాస్టారు చెప్పలా పగటి నిద్ర మంచిదికాదని."

దొంగతనం చేసి దొరికి నట్లయింది గోపీ పని.

"చెప్పాడనుకో..." అని నసుగుతూ పరుగెత్తాడు ముఖం కడుక్కోవడానికి.

సెలవు లొచ్చాయన్నమాటే కానీ గోపీ కేమీ తోచ లేదు. అలా వీధిలో ఓ మారు తిరిగి వచ్చాడు. కాని స్నేహితు లెవరూ కన్పడలేదు. వాసు యిల్లు ఓ ఫర్లాంగు దూరం వుంటుంది. అక్కడికి పరుగెత్తాడు గోపీ. వాసు తోటలో ఏదో తవ్వుతున్నాడు.

"ఒరేయ్ ! ఏమి ట్రా అలా కెలుకుతున్నావ్ ?"

"ఉండ్రా ! నీ వొక్కడు తగలడ్డావ్ !

వాసు మాట్లాడక మళ్ళీ వెతుకుతున్నాడు.

కాసేపాగి మళ్ళీ అడిగాడు గోపీ.

"ఏమి ట్రా వెదుకుతున్నావ్ ?"

వాసు మాట్లాళ్ళేదు. పాలిపోయిన ముఖంతో వెదుకు తున్నాడు.

"ఒరేయ్ ! చెప్పవా ? అలాగైతే మా టెలిఫోను ముట్టనిస్తానేమో చూడు."

"అది కాదురా గోపీ ! నేను ఓ డబ్బు చెట్టు నాటాన్లే."

"డబ్బు చెట్టా ! అదేలారా నాటేది ?"

"ఏముందోయ్ ! సులభం. ఓ పదిపైసల బిళ్ళ తీసుకో. అమ్మో ! రహస్యం. నేనిక చెప్పను. కిట్టిగాడు ఎవరికీ చెప్ప నని వట్టేయించు కున్నాడు. వాడు మాత్రం ఒక తాయానికి చెప్పాడా ? వానికి పది స్టాంపులూ, ఐదు గచ్చకాయలు యిచ్చా."

"నేను పది పాసింగ్‌షో సిగరెట్ పీకలిస్తాగానీ నాకు చెప్పవురా ?"

"పోవోయ్ ! బోడి సిగరెట్ పీక లెవడికాక్కావాలి ?"

"పోనీ మా ఫోను ముట్టుకోనిస్తాకే !"

"ఓహోఁ! ఫోను మొట్టుకుంటే ఏం వస్తుంది? నేనేం చెప్పను."

"ఒరేయ్! మనిద్దరం జట్టుగదరా! చెప్పవ్?"

"ఊహుఁ"

"......"

"నీ పెద్ద జీరంగి నిస్తావా మరి-చెప్తా."

'అబ్బ! ఎంతాశ! అదేమివ్వను. కావాలంటే జీరంగి గుడ్లిస్తా.'

'గుడ్లెవడిక్కావలి? అవేం, ఆడుతాయా, పాడుతాయా? నాకు జీరంగే కావాలి.'

"పోనీ నా 'బొంగరం' యిస్తా-స.రేనా."

"ఊహుఁ. నాకేం వద్దు. జీరంగే కావాలి."

కోపం వచ్చింది గోపీకి.

"పోవోయ్! నీ డబ్బు చెట్టెవడిక్కావాలి? దానికేం కాయలు కాస్తుందా; పూవులు పూస్తుందా?"

'పూలూ, కాయలూ కాయవుగానీ డబ్బులు కాస్తాయోయ్ - వెర్రి మొగమా!'

"చెట్లకేం డబ్బులు కాయవు"

"నీకేం తెలుసు పోవోయ్! వంకాయ్! కిట్టుగాడింట్లో కాస్తుంటేఁ"

"నిజంగానా?" ఆశ్చర్యపోయాడు గోపీ.

"అంత అనుమానముంటే వాణ్ణే అడుగు పో."

కాసేపాలోచించాడు గోపి.

"సరే. మరి నా జీరంగి నిస్తాగానీ చెప్తావా?"

"ఏదీ జీరంగి?"

"ఇదో." జేబులోంచి ఓ అగ్గిపెట్టె తీశాడు గోపి.

"ఇలాతే" అగ్గిపెట్టెలోని రంగు రంగుల జీరంగిని చూసి సంతోషంతో జేబులో వుంచుకున్నాడు వాసు.

"చెప్తాగానీ! ముందిక్కడ వెదుకు. ఓ పదిపైసల బిళ్ళ వుండాలి."

ఇద్దరూ మాట్లాడకుండా పదిహేను నిముషాలు వెదికారు. కానీ దొరకలేదు.

"ఒరేయ్! ఎక్కడ పడేసుకున్నావ్‌రా వాసూ?"

"పడేసుకోలేదోయ్! ఇక్కడే పాతాను."

"అంతా కెలికేశావా? ఇంకెక్కడ దొరుకుతుంది."

"ఐతే దొరకదంటావా?" జాలిగా అడిగాడు వాసు.

"నాకో వుపాయం తెల్సు. చెప్పనా?"

"ఊఁ— చెప్పు. త్వరగా"

"ఓ పైస బిళ్ళ తీసుకో. కళ్ళుమూసుకుని, 'పైసా, పైసా నీ స్నేహితుడు పది పైసలు ఎక్కడో వెళ్ళాడు. ఎక్కడున్నాడో కనుక్కో.' అని ఎగరేస్తే అదిపోయి దాన్ని వెదుకుతుంది."

"నిజంగానా ?"

"నిజం. పట్టు."

"అదికాదోయ్ ! పైసకు మాటలు రావు కదా ! మరి అదెలా వెదుకుతుంది ?"

"పోరా ! నీ కన్నీ అనుమానాలే ! శంకర్ నా ఎదురుగానే అలా కనిపెట్టాడు, తెలుసా ?"

" ఈ పైసా కూడా పోతే ?"

"అలాగైతే నా పైసనే ఎగరేస్తాలే"

"ఇక కళ్లు మూసుకోరా వాసూ. మళ్ళీ నే చెప్పే వరకూ తీయద్దు." జేబులోనుండి వో పైసా బిళ్ల తీశాడు గోపీ. రెండు కళ్ళు మూసుకుని, "పైసా, పైసా ! నీ స్నేహితుడు పదిపైసలు ఎక్కడో తప్పిపోయాడు. వెళ్లి వెదుకు. వెదకూ..." పైకి ఎగరేశాడు పైసను.



వెంటనే యిద్దరూ కళ్ళు తెరిచారు. పైస క్రింద పడ్డ చప్పుడు కూడా విన్పళ్ళేదు. ఇద్దరు పైస కోసం తెగ వెదికారు. కాని కన్పళ్ళేదు. "ఒరేయ్ గోపీ! నే నప్పుడే చెప్ప లేదు టా పైసకు మాటలు రావని. ఇప్పుడిదికూడా ఎక్కడోపోయింది."

"పోవోయ్! అపశకున పక్షీ! ఇంకాసేపు వెదుకు."

ఇద్దరూ మాట్లాడకుండా మళ్ళీ వెదుకసాగారు. పావు గంట గడచినా ఫలితం కన్పడలేదు.

"ఇంతకూ, నీవు పదిపైసలు పాతావో, లేదో"

"పాతానురా"

"ఎవరైనా కొట్టేశారేమో!"

"ఎవరికీ తెలియదురా"

"మరి నాపైస ఎలా పోయింది?"

"ఏమో! నాకేం తెల్సు, నా పది పైసలు పోయి నే నేడుస్తుంటే."

"నీనుంచే నాపైస పోయింది"

"నానుంచేం పోలేదు. నీవే పారేసుకున్నావ్."

"నీ పది పైసల కోసమే ఎగురేశాను"

"నేనేం, పారేసుకోమన్నానా నిన్ను?"

పది పైసలు పోయిందని వాసు, పైస పోయిందని గోపీ విచారంలో వున్నారేమో – అలాగే తగవు పెరిగింది.

"నేను వెదుక్కుంటుంటే, నీవే వచ్చి నా పది పైసలు దొరక్కుండా చేశావు"

"నేనేం చేయలా. నీనుంచే నా పైసా పోయింది"

"హోహోయ్! మబ్బు మొగం నవ్వు"

"నీదే కోతి మొఖం"

"నీదే"

"నీదే"

"ఒరేయ్ గోపీ! నేనిక తంతా నంతే."

"తన్నవోయ్ చూద్దాం. నేనేం గాజులేసుకుని కూర్చో లేదు-తన్నులు తినడానికి"

"వాసుకు కోపం వచ్చింది; గోపీకి కోపం వచ్చింది. వాసు కోపంతో ఒక దెబ్బవేశాడు. గోపీ దెబ్బకు దెబ్బ వేశాడు. అలాగే కుస్తీలు పట్టారు. ఇంతలో వాసు తమ్ముడు గిరి అక్కడికి వచ్చాడు.

"ఐ! ఐ! కుస్తీ పందాలు. అమ్మా! వీడిక్కడ కుస్తీలు పడ్తున్నాడే."

"ఒరేయ్ గిరిగా! నోర్మూసుకుని వుంటావా; తన్నులు కావాలా?"

"తన్నుకుని చావండినాకేం? గోప్పీ వాసుగాణ్ణి క్రిందకు వేయరా"

ఇంతలో గిరి కళ్లు మెరిశాయి.

"ఐ! నాకో పైస దొరికింవోచ్చ్. అరె! యింకో పది పైసలు ప్రక్క-ప్రక్కనే పడ్డాయి."

"ఏదీ? చూడే. తేరా!" గోపీ, వాసు కొట్లాటమాని పరుగెత్తు కొచ్చారు.

"అబ్బ! మీదేం కాదు ఫో! నాకు దొరికింది"

"ఒరేయ్! అవి మావే! పైసనాది; పది పైసలు వాసువి. వాసూ చూశావురా నా పైస ఎలా వెదికిందో!"

"ఏంటీఁ! పైస వెళ్లి పదిపైసలను వెదుకుతుందా? పచ్చి కోతలు కోస్తున్నాడోచ్"

"ఒరేయ్! మా పైసలు మాకిచ్చేయ్" అడిగాడు వాసు.

"ఫోఁ! నేనే మివ్వను. నాకవి దొరికాయి."

"ఇస్తావా; యివ్వవా? అమ్మతో చెప్తానంతే."

"పోవోయ్! చెప్పుకో పో.

చెప్పుకో చెప్పుకో చెవి కోసుకో,
మామిడాకిస్తా మంత్రిచ్చుకో.
ఎలుకనిస్తా కోసుకుని తిను."

"నీవే తిను. ఇస్తావా; యివ్వవా? ఇక తంతానంతే"

"ఊహూ"

"ఒరే గోపీ ఆ చెయ్యి పట్టుకోరా— పీక్కుందాం"

గిరి గలాభా చేస్తున్నా లెక్కచేయక గోపీ, వాసూ కలసి పైసలు లాక్కున్నారు.

"అమ్మాఁ! చూడవే వీళ్లు నా పైసలు పీక్కుంటున్నారు" గట్టిగా ఏడ్పు లకించుకున్నాడు గిరి.

ఇంతలో వాసు—వాళ్ళమ్మ వచ్చింది.

"ఎందుకురా ప్రొద్దున్నలేచి వాణ్ణి ఏడ్పిస్తున్నావ్?"

"నేనేం ఏడ్పించలా. వాడే ఏడుస్తున్నాడు"

"నాకు పైసలు దొరికింతే వాళ్లు పీక్కున్నారే"

"నీకెలా దొరుకుతుందోయ్? మేమక్కడ పెట్టి ఆడుకుం టుంటే వాడొచ్చి ఎత్తుకున్నాడమ్మా!"

"వాళ్ళేం ఆడుకోలా. వాసు, గోపీతో కుస్తీ పట్టాడే! గిరి తన పట్టు విడువలేదు.

"ఏరా గోపీ! ఎందుకు కుస్తీలు పట్టారు?"

తనపై అమ్మతో చెప్తాడెమో నని వాసుకు భయంవేసింది "లేదండి, మరేమో మేం సరదాగా కుస్తీ పట్లు నేర్చుకుంటు న్నాం." స్నేహితుడి జవాబు విని కృతజ్ఞతతో మెరిశాయి వాసు కళ్లు. గిరి ఏడ్పు లంకించుకున్నాడు.

"ఊం ఊం నాకు దొరికింతే వీళ్ళే పీక్కున్నారు."

"ఒరేయ్! ఏడ్పు మొగమూ, నువ్వూ లోపలికెళ్ళు. వాళ్లజోలికి నీ వెందుకురా వెళ్తావ్?" గిరిని కసిరింది వాళ్లమ్మ గిరి ఏడ్చుకుంటూ యింట్లోకెళ్తాడు.

"నే చెప్పలేదురా వాసూ! చూశావా ఎలా వెదికిందో నా పైసా?"

"నీవే వుత్తుత్తినే తగవులాడావు."

"నేనేం కాదు. నువ్వే."

"పోన్లే కానీ యికపై తగవు లాడేనాన్ను." పది పైసలు దొరికిందన్న సంతోషంతో ఓటమి నంగీకరించాడు వాసు.

"సరే కానీ డబ్బు చెట్టెలా నాటడం."

"ఏముందోయ్ సులభం! కొద్దిగా కష్టం అనుకో. నీకు ధైర్యంవుంటే చాలు.

"సరేలే, త్వరగా చెప్పు."

"మొదట ఓ పదిపైసల బిళ్ల తీసుకో. క్రొత్తగా వుండాలి సుమా. ఏమనుకున్నావో. పాతవి నాటితే పుచ్చిన పైసలు కాస్తాయి."

"అహాఁహాఁ. ఎక్కడైనా పుచ్చిన పైసలుంటా యట్రా!"

"అబ్బబ్బ! నవ్వకోయ్. వెధవ నవ్వూ, నువ్వూ. నాకేం తెల్సు? కిట్టిగాడే చెప్పాడు."

"ఒరేయ్ వాసూ! నీవు పుచ్చిన పైసలెక్కడైనా చూశావుట్రా?"

"చూళ్ళేదనుకో! ఐనా కిట్టిగాడు చూసుంటాడు తెల్సా? వాడు చాలా డబ్బు చెట్లు నాటాట్ట. నీ కసలు డబ్బు చెట్టు నాటేదెలాగో చెప్పాలా, వద్దా?"

"చెప్పు మరి."

"క్రొత్త పదిపైసల బిళ్ల తీసుకున్నావా! ఇక చెట్టు నాటాలన్నమాట. తోటలో మోచేయి లోతు గుంత త్రవ్వాలి. చెట్టేమో రాత్రి పన్రెండు గంటలకు నాటాలి."

"రాత్రిపూటేం చెట్లునాటుతు."

"గోపీ నే చెప్పేది వింటావా, లేదా? ఇక నే చెప్ప నంతే!"

"లేదు లేరా? చెప్పు వింటా."

"ఓ పిడికెడు వడ్లు గుంతలో వేయాలి. తర్వాత ఓ పిడికెడు మట్టి వేయాలి. ఆ తర్వాతేమో ఓ మంత్రం చెప్పాలి దగ్గరగా రారా మంత్రం చెప్తా... ఈ మంత్రం చెప్పాక పది పైసల బిళ్ల గోతిలోకి వేసి దాన్ని పూడ్చెయ్యాలి. తెల్సిందా? మరి మూడురోజు లక్కడికెళ్లి చూడకూడదు. నాలుగోరోజు పొద్దున్నే వెళ్ళిచూశావా, అక్కడ డబ్బు చెట్టుంటుంది."

"మరి నీ వ్వేసిన చెట్టెందుకు రాలేదురా వాసూ!"

"నేను రాత్రి వేశాలా. పొద్దున పండెండు గంటలకు పదిపైసలకేం తెలుస్తుందిలేనని ఓ కల్లు గుడ్డలో చుట్టుకుని వచ్చి వేశా. ఐనా అది పగలేశానని కనుక్కుందనోయ్. లేవ లేదు."

డబ్బు చెట్టుకు డబ్బులు కాస్తయ్యా"

"ఊఁ. మరేం అనుకున్నావ్. లావు, లావుకాయలు కాస్తాయి. కాయలను పగులకొడ్తే లోపల డబ్బులుంటాయి"

"మరచారా, వాసూ! మరి నీళ్ళెయ్యక్కర్లేదా?"

"అక్కర్లేదోయ్! డబ్బు చెట్టుకు నీళ్ళెందుకు?"

"మనసైన్సు మాష్టారు చెప్పలేదురా, చెట్లు మొల కెత్తాలంటే గాలీ, నీరూ సూర్యరశ్మి కావాలని"

"సైన్సు మాష్టారికి "డబ్బుచెట్టు" సంగతి తెలియదు లేరా !"

గోపీ ఆలోచనలో పడ్డాడు. వానికింకా నమ్మకం కలుగ లేదు. ఇంతలో వాసు వాళ్లమ్మ వాసుని పిలిచింది.

"నే పోతారా గోపీ" వాసు వెళ్ళిపోయాడు.

ఇంటి ముఖం పట్టాడు గోపీ.

* * *

## 2

ఆ దినమంతా డబ్బు చెట్టు గురించే ఆలోచిస్తున్నాడు గోపీ. మధ్యాహ్నం శంకర్ యింటికి వెళ్ళి కేరం బోర్డు ఆడాడు రాత్రి పన్నెండు గంటలకు తోట లోకెలా పోవాలన్నదే సమస్య ఐపోయింది. ఈ దినం నుండి ఆలుబయట పడుకుందా మని నాన్న చెప్పినమాట గుర్తుకు వచ్చింది. "ఇంకేం ! పన్నెండు గంటలకు సరిగ్గా తోటలోకెళ్తే సరి" అనుకున్నాడు గోపీ. తోటలో చింతచెట్టు వెనుక ఓ గొయ్యి తీశాడు. సరిగ్గా మూరెడుంచాడు. అమ్మకు **తెలియకుండా** ఓపిడికెడు వుప్పు తీసుకెళ్ళి అక్కడే దాచాడు. గోపీ దగ్గర ఓ పది పైసల బిళ్ళ వుంది. కాని అది అంత క్రొత్తగాలేదు. పుచ్చిన డబ్బులు

కొస్తాడేమోనని భయం వేసింది. కాసేపు ఏం చేయాలో తోచలేదు. గోపికి.

రమేష్ దగ్గరికెళ్ళాడు. వాడి దగ్గరొక క్రొత్త పది పైసల బిళ్ళవుంది.

"రమేష్! నేను జీరంగి గుళ్ళిస్తాగాని, నీ దగ్గరున్న పది పైసలిస్తావురా, నా దగ్గరున్నదిస్తా."

"ఏది చూపించు, ఎలా వుందో!"

జేబులోనుంచి పదిపైసలు తీసి చూపాడు గోపి.

"ఛా! పాతబిళ్ళ! నేనేం యివ్వను."

"మరి నేను జీరంగి గుళ్ళువద్దా? క్రొత్తబిళ్ళను అంగట్లో ఎక్కువేం యివ్వరు - తెల్సా?"

"అలాగైతే నాకెందుకు"

ఇప్పుడు చిక్కులో పడ్డాడు గోపి.

"మళ్ళీ చెప్తాగానీ, యివ్వవ్?"

"సరే తీసుకో! మరి జీరంగి గుళ్ళేవీ?"

అగ్గిపెట్టెనుంచి జీరంగి గుళ్ళు తీసిచ్చాడు గోపి.

"మరి నే పోతారా. చాలా పనివుంది." ఇక అక్కడుంటే ఆ పదిపైసలు రమేష్‌గాడు తిరిగి తీసుకుంటాడన్న భయంతో పరుగెత్తాడు గోపి.

గోపి అదృష్టం బాగుంది. ఇంట్లో వుక్క వేస్తుందని అంతా ఆ రోజునుంచి బయట పడుకుంటున్నారు. రాత్రయింది. గోపి పడుకున్నాడు కానీ నిద్రపోలేదు.

"ఇలాగే పన్నెండు గంటలవరకూ లేచివుంటే చాలు" అనుకున్నాడు గోపీ. కానీ సాయంకాలమంతా బాగా గంతులు వేసి వచ్చాడేమో, అలా కాసేపు పడుకున్నాడో లేదో, నిద్ర వచ్చేసింది.

పన్నెండుకు సరిగ్గా లేచాడు గోపీ. మెల్లిగా చూచాడు అబ్బ! చీకటి కొంచెంకూడా లేదు. చందమామ ఏం చక్కా అద్దం లాగుతున్నాడు. అమ్మా, నాన్నా గుర్రుపెట్టి నిద్ర పోతున్నారు. మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ, డబ్బు చెట్టు నాటాల్సిన చోటు కెళ్ళాడు. ఉప్పువేసి, మన్ను వేశాడు. ఇక పదిపైసల బిళ్ళ వేసి మంత్రం చెప్పాలి. పదిపైసల బిళ్ల తళతళ మెరుస్తోంది. లోపలికేశాడు. మంత్రం చెప్పబోయాడు కానీ జ్ఞాపకం రాలేదు. "పోనీ అలాగే పూడ్చేస్తే? అబ్బే! నీళ్ళన్నా వెయ్యంకదా మరి మంత్రం కూడా చెప్పకపోతే డబ్బు చెట్టెలా మొలుస్తుంది? పోనీ రేపు నాటుదాం" అనుకున్నాడు గోపీ. పదిపైసలు తీసుకుందామని వెదకాడు. దొరకలేదు. ఆశ్చర్యం. పదిపైసల బిళ్ళ అసలక్కడ లేదు. మంత్రం మరచి పోయిందానికి తన్నుతాను తిట్టుకున్నాడు గోపీ. ఇప్పుడేం చేయాలి?

"ఒరేయ్! గోపీ! పదయింది లేవరా" అమ్మ అరిచింది. అమ్మ తోటలో కెలావచ్చిందో వానికర్థంకాలేదు. ఐతే, యిది కలన్నమాట. అమ్మయ్య? తేలిగ్గా నవ్వుకున్నాడు జేబులో చూస్తే, పదిపైసల బిళ్ళ అలాగేవుంది. ఇక ఆగకుండా, తోటలోకి పరుగెత్తాడు. తన్నుత్రవ్విన గొయ్యి అలాగేవుంది.

"అమ్మయ్య" అనుకొని వెనక్కు వచ్చేశాడు గోపీ.

"నిన్న జరిగిన యుద్ధంలో మన సైనికులు నలభై పాకిస్తాన్ వారి టాంకులను నాశనం చేశారు. తొమ్మిది పాటన్ టాంకులను పట్టుకున్నారు." రేడియోలో వార్తలయి పోవచ్చాయి.

నాన్న శ్రద్ధగా వింటున్నారు.

"నాన్నా! నాన్నా! మరి ఇప్పుడు మనకూ పాకిస్తానుకూ యుద్ధమా?

"ఆఁ"

"ఎందుకు నాన్నా యుద్ధం?"

"పాకిస్థాను వారు వచ్చి మన భూభాగం ఆక్రమించుకోడానికి ప్రయత్నిస్తున్నారు."

"మరి మనవాళ్ళు తన్ని పంపలేదా?

"అదేగా మరి చేస్తూంటె! యుద్ధమంటే మాటలనుకున్నావా? వారి దగ్గర అమెరికా ఇచ్చిన టాంకులు, విమానాలు, ఆయుధాలూ ఎన్నో వున్నయ్!"

"ముఖం కడుక్కుని కాఫీ తాగరా గోపీ" అని అమ్మ అరవడంతో పరిగెత్తాడు గోపీ.

'ఈ దినం నిద్రపోకుండా పండెండు గంటలవరకు లేచి వుండాలి' అనుకున్నాడు గోపీ. రాత్రి నిద్రరాకుండా వుండేందుకు, మధ్యాహ్నం బయటి కెళ్ళక బాగా నిద్రపోయాడు.

సాయంకాలం కూడా ఎక్కువసేపు గంతులు వేయకుండా అలాగే తిరిగి వచ్చారు.

రాత్రయింది. ఇంట్లో అందరూ గుర్రుపెట్టి నిద్రపోతు తున్నారు. గోపీ మాత్రం నిద్రపోకుండా కళ్ళు తెరిచి నక్షత్రాలను చూస్తూ పడుకున్నాడు.

బయటంతా చీకటిగావుంది. అలాగే ఎంతసేపున్నాడో అబ్బ. ఇక పండ్రెండయ్యింది అనుకున్నాడు గోపి. ఇంతలో "ఠంగ్, ఠంగ్..."మని పదకొండు గంటలు కొట్టారు పోలీసు ఠాణాలో. అంతా ఎంచుకున్నాక అనుమానమొచ్చింది ? పదకొండా పండ్రెండా ? పండ్రెండేమో ! తను తప్పు ఎంచుకున్నాడేమో ! ఎలా కనుక్కోవడం ? ఇంతలో ఒక సంగతి గుర్తుకువచ్చింది. ఠాణాలో రెండు, రెండు గంటలు కలిపి కొడతారు. కడపటి ఒక గంట వినపడింది. అంటే పదకొండే అయ్యుండాలన్నమాట- అలాగే ఎంతసేపో మేలుకున్నట్టుంది గోపీకి. గోపీకి తెలియకుండానే నిద్రముంచుకు వచ్చింది.

"భౌ ! భౌ ! కుయ్యో !" మన్న శబ్దాలతో మెలకువ వచ్చింది గోపీకి. పొద్దునయిపోయిందేమోనని భయంవేసింది కాని చుట్టూ చీకటిగా వుంది. "హేయ్!" నాన్న తరిమేశాడా కుక్కలను.

అబ్బ ! పాడు కుక్కలు మంచి నిద్రచెడగొట్టాయి. పండ్రెండు. కావస్తోందో!" అన్నది అమ్మ.

గోపీకి సంతోషం కల్గింది. ఏమో "పాడుకుక్కలేంకావు మాంచి కుక్కలు" అనుకున్నాడు మంచి.

అమ్మ వెళ్ళి తాళం తీసి మంచి నీళ్ళు తాగి వచ్చింది. గోపీ మేల్కొని వుండడం చూచి, "గోపీ! నీకూ కావాలా మంచినీళ్ళు?" అని అడిగింది.

"ఊహుఁ వద్దు."

అమ్మ పడుకుంది. గోపీ డబ్బు చెట్టు సంగతే ఆలోచిస్తున్నాడు. మంత్రం ఒకమారు మనసులోనే అనుకున్నాడు. జేబులో చూసుకున్నాడు—పదిపైసలు కన్పించలేదు. జేబులోని వన్నీ తీసి మళ్ళీచూచాడు. ఊహూఁ. లేదు. ఏడ్పువచ్చింది. గోపీకి. 'పదిపైసలు ఎక్కడుంచా చెమ్మా' తెగ ఆలోచించాడు. గుర్తుకు రాలేదు. "ఎక్కడైనా పడిపోయిందేమో!" అనుమానం వచ్చింది. మళ్ళీ జేబులోని వన్నీ బయటికి తీశాడు. పాత రైల్వే టిక్కెట్లు, బొంగరం వున్నాయి. రైల్వే టిక్కెట్లు మావయ్య వచ్చినప్పుడిచ్చినవి. ప్రొద్దుటినుంచీ తన జేబులో లేనివి యిప్పుడెలావచ్చాయా; అని ఆశ్చర్యంవేసింది. 'ఇదేం కలనా?' అనుమానం వచ్చింది గోపీకి. అనుమానం తీర్చుకోడానికి మెల్లిగా లేచి చెల్లెలుకాలు గట్టిగా గిల్లాడు. చెల్లి లేచి గట్టిగా ఏడ్వడం మొదలెట్టింది.

"అబ్బబ్బ! నా ప్రాణం తోడేస్తుస్తున్నారు. ఆ కుక్కలొకచోట, యిదొకచోట" గొణుగుతుంది అమ్మ.

గోపీ సందేహం తీరింది. కాని పదిపైసల సంగతి తేలలేదు. టిక్కెట్లు జేబులోకెలా వచ్చాయో అర్థంకాలేదు.

ఇంతలో ఠక్కున జ్ఞాపకం వచ్చింది. గోపీకి తను రాత్రి లాగు మార్చాడు. బొంగరం మాత్రం క్రిందపడ్డ తీసి జేబులో వుంచుకున్నాడు. 'అమ్మయ్యో ఆ లాగులో పదిపైసలు వుంది! ఇప్పుడెలా తేవడం? ఒక వుపాయం ఆలోచించాడు.

"అమ్మా! అమ్మా!"

"ఏరా!"

"నా జేబులో బొంగరం గుచ్చుకుంటోందే"

"తీసి కిటికీలో పెట్టు"

"ఎవరైనా దొంగ లెత్తుకుపోతే?"

నవ్వింది అమ్మ. "నీ మొహం. నీ జీరంగులూ, బొంగరాలూ ఎవర్రా ఎత్తుకుపోతారు?"

"ఊఁ. నేను లోపలే పెడ్తాను."

"ఒరేయ్! నోర్మూసుకుని అక్కడ కిటికీలో పెడ్తావా? లేదా?"

ఇక ఏం చేయాలో తోచలేదు గోపీకి. 'ఇక యీ పదిడు 'నిక్కొందామా' అనుకున్నాడు. కానీ రేపు కూడా యిలా పడపోతే! అందుకే యింకో వుపాయం ఆలోచించాడు.

"అమ్మా! దాహం వేస్తోందే!"

"ఒరేయ్! ఇందాక మంచినీళ్ళు వద్దని యిప్పుడు మళ్ళీ 'దాహం' అంటావేరా?"

"మరేమో అప్పుడేదాహం వేయలా ఇప్పుడే వేందిస్తో"

"మొండి ఘటం" అని అమ్మ తాళం తీసింది.

గోపీ పరుగెత్తుకెళ్ళి పదిపైసల కోసం వెదుక సాగాడు.

"నీళ్ళు తాగవేరా ?"

"ఇదో వస్తున్నా?" పదిపైసలు త్వరగానే దొరికింది. దాన్ని జేబులో వేసుకుని నీళ్లు త్రాగాడు. గడియారం చూస్తే పన్రెండు కింకా పదినిముషాలుంది.

"గోపీ! ఇక నిద్ర లేవావంటే!" అమ్మ వెళ్ళి పడుకుంది. గోపీ కళ్లు తెరుచుకొని పడుకున్నాడు. నిద్రరాకుండా వుండ డానికి నక్షత్రాలు లెక్కపెట్ట సాగాడు. అందరూ నిద్ర పోతున్నారు.

మెల్లిగా లేచాడు గోపీ. అంతా నిశ్శబ్దంగా వుంది. తలగడను నిలువుగా పెట్టి బెడ్ షీటు కప్పాడు. దూరంనుంచి చూస్తే అచ్చం మనిషిలాగే వుంది. అడుగులో అడుగు వేసు కుంటూ తోట దగ్గరికి వెళ్ళాడు. వేపచెట్టు క్రిందికి వచ్చాడు. ఎక్కడో ఏదో పక్షి 'క్వీక' మని అరచింది. ముచ్చెమ్మటలు పోశాయి గోపీకి. భయంతో కాళ్ళు వణికాయి. గుండె "లటుక్కు' 'లటుక్కు' మని కొట్టుకుంటోంది. ఈ వెధవ 'డబ్బు చెట్టు' లేకపోతేనేం, అన్పించింది



"కాని కిట్టిగాడు వేశాట్ట రాత్రి నేను వేయలేనా? ఓస్! ఇంకొద్ది దూరం పోతే చింతచెట్టు వస్తుంది. ఆ ప్రక్కనే గొయ్యి వుంటుంది." అనుకున్నాడు గోపీ. మెల్లగా ముందుకు కదిలాడు. దినమూ తిరుగుతున్నదే. ఐనా తోటంతా క్రొత్తగా వుంది. కటిక చీకటి. ఎదురుగానున్న చెట్లుకూడా కనపట్టంలేదు. ఇంతలో... గోపీ గుండెలాగిపోయాయి. నోరు పిడచకట్టుకు పోయింది. గట్టిగా అరుద్దామనుకున్నాడు. కాని

నోరు పెగల్లేదు. కాళ్ళు వణుకుతున్నాయి. గుండెలపై చేతు లుంచుకున్నాడు. ఇప్పుడవి వేగంగా కొట్టుకుంటున్నాయి. గోపీ కెదురుగా రెండు గుడ్లు మిలామిలా అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయి. గోపీ కాళ్లు నేల కంటుకుపోయాయి. అలాగే వణుకుతూ నిలబడ్డాడు.

"ఏమిటి చెప్మాయిది ?"

"చీకట్లో పులుల కళ్లు మెరుస్తాయట" సాంబు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి.

"అబ్బే యిక్కడ పులులెలావస్తయ్యి ?" ధైర్యంతో మరోక్క మారు చూశాడు. ఠక్కున గుర్తుకొచ్చింది. అది గుడ్లగూబ. అంతలోనే "క్రీక్ ! క్రీక్"మని భయంకరంగా అరుస్తూ ఎగిరి పోయిందా గుడ్లగూబ.

ఇప్పుడు కాస్త ధైర్యం వచ్చింది గోపీకి. ముందు కెళ్ళాడు. చింతచెట్టు దగ్గరికెళ్ళికచూశాడు.

"అరేఁ. ఆశ్చర్యంతో మళ్ళీ చూశాడు. గొయ్యిలేదు! గొయ్యి నెవరేనా పూడ్చారా అంటే, త్రవ్విన గుర్తులేవు. ఎలా మాయమయింది గొయ్యి ?"

దెయ్యాలు రాత్రుళ్ళు తిరుగుతూ, మాయలు చేస్తాయట" వాసుగాడు చెప్పాడు. ఇక్కడకూడా దయ్యాలున్నయ్యేమో ! పైకి తలెత్తిచూచాడు. చీకట్లో చింతచెట్లు వెంట్రుకలు విరబోసుకున్న రాక్షసిలా భయంకరంగా కన్పించింది. చెట్టుపై ఎవరో వున్నట్టనిపించింది.

"అమ్మ బాబోయ్ ! దయ్యం !" పరుగెత్తాడు గోపీ. ఆ పరుగెత్తడంలో చింతచెట్టు అవతలి వేపుకువెళ్ళి ఏదో గొయ్యి అడ్డువచ్చి ధమ్మని పడ్డాడు. గోతిలో ఓ పొట్లం కరకరమంది.

"అబ్బ ! మతిమరపుముండ ! యీ వైపు - నేను గొయ్యితీసింది. దయ్యం లేదు. గియ్యం లేదు." అని గట్టిగా అనుకున్నాడు గోపి. కాస్త ధైర్యం వచ్చింది. ఇంతలో "గుయ్ఁ ! గుయ్ఁ ! గుయ్ఁ !"మని శబ్దం వచ్చింది. పైకి చూచాడు. భయంకరంగా వుంది చింతచెట్టు అక్కడక్కడ చెట్టుకొమ్మల సందుల్లోంచి నక్షత్రాలు కన్పిస్తున్నాయి.

సహజంగా ధైర్యస్తుడేమో కొంత భయం తగ్గింది· కాని పూర్తిగా భయంపోలేదు. దయ్యాలు, దయ్యాల కథలు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా కాళ్లు వణుకుతున్నాయి.

"తెల్లని చీరలు కట్టుకుని వస్తాయోయ్ దయ్యాలు. దయ్యాలు నవ్వుతాయి తెల్సా ? మా తాత చెప్పాడు. దయ్యాలు అనేక రూపాల్లో వస్తాయట. మా తాతతో ఓ దయ్యం కొట్లాడిందట" వాసుగాడు చెప్పిన మాటలు యింకా చెవుల్లో వినబడ్తున్నాయి గోపీకి. వాసుకు బోల్డన్ని దయ్యాల కథలు తెలుసు. కాని సైన్సు మాష్టారు చెప్పారు. దయ్యాలనేవి లేవనీ, అది మన భ్రమ మాత్రమేననీ.

"దయ్యాలు వుంటాయి. లేకపోతే, వాసు తాతకు ఎలా కనబడతాయి ?" అనుకున్నాడు గోపీ. చచ్చిన వాళ్లు దయ్యాలుగా పుడ్తారట. క్రితం సంవత్సరం బస్సు ప్రమా

షంలో చనిపోయిన 'నరహరి' గుర్తుకొచ్చాడు గోపికి. వాడూ యీ వీధిలోవాడే. దయ్యమై యిక్కడే తిరుగుతున్నాడేమో! ఈ తలంపుతో గోపి కాళ్లు, చేతులు వణకసాగాయి.

"దయ్యాలు వస్తే. ఆంజనేయస్వామిని తల్చుకుంటే చాలు – పరుగెత్తి పోతాయట" వాసుగాడే చెప్పాడు.

"ఆంజనేయా, హనుమంతా, యీ దయ్యాలను తరిమెయ్యిస్వామీ" కళ్లు మూసుకుని ప్రార్థించాడు గోపి.

కండ్లు తెరచి చూసేప్పటికి కాస్త ధైర్యం వచ్చింది. చింతచెట్టువైపు చూసినా భయంవేయలేదు. ఇక ఆలస్యం చేయకుండా, వృష్ఠవేసి, పదిపైసలూ వేశాడు. మరుక్షణం గుర్తుకొచ్చింది ఓ పిడికెడు మన్నువేయాలని. పదిపైసల కోసం చెయ్యి వేస్తుండగనే, "ఠంగ్, ఠంగ్ ... ఠంగ్ ..."మని ఠాణాలో పండ్రెండు గంటలు కొట్టారు. అబ్బ! సరియైన సమయానికే వేస్తున్నాను." అనుకొని మళ్ళీ వెదికాడు. ఊహుఁ. దొరకలేదు. నిన్నరాత్రి వచ్చిన కల జ్ఞాపకం వచ్చి వళ్ళంతా చెమటలు పోసింది. ఇక దొరకదేమోనన్న భయంతో ఆత్రంగా వెదికాడు. అది యీ మారు త్వరగానే దొరికింది.

ఓ పిడికెడు మన్నుతీసి వేశాడు. పదిపైసలు వేసి మంత్రం చెప్పబోయాడు. "ఓం! హ్రీం!..." తరువాత గుర్తుకురాలేదు. "ఛీ! ఛీ! కలలో వచ్చినట్టే ఔతోందే-అనుకుని, బాగా జ్ఞాపకం చేసుకున్నాడు. కాసేపు పం చేసినా ప్రయోజనేం లేకపోయింది. కాని వున్నట్టుండి దానంతకదే ఠక్కున గుర్తుకొచ్చింది.

"హ్రాం! హ్రీం! ఘనం వృక్షం, వృద్ధిరస్తు! వద్ధిరస్తు" గొయ్యి పూడ్చేశాడు. మంత్రం చెప్పి. డబ్బుచెట్టు నాటా నన్న సంతోషంతో ఎగిరి దుమికాడు. కాని ఆ ఎగరడంవెళ్ళి అక్కడున్న ముండ్లకంపపై పడ్డాడు. "అమ్మో" గట్టిగా అరువ బోయాడు. కాని అరిస్తే అందరూ లేస్తారన్న భయంతో కుంటుకుంటూ నోరు మూసుకుని వెళ్ళక తప్పిందికాదు.

కొంతదూరంవెళ్ళి వెనక్కు తిరిగి చూశాడు. ఏముంది? గోపీ గుండె లదిరాయ్. ఎవరో తెల్లని చీర కట్టుకుని తను పాతిన గొయ్యి దగ్గర నిలబడ్డారు. ఇంకెవరు? దయ్యమే అది

"అమ్మో! దయ్యం!" గట్టిగా అరిచాడు గోపీ. కాని శబ్దం రాలేదు. నోరు పెగిలేగా, మళ్ళీ చూచాడు. ఈ మారు దయ్యం చింతచెట్టుపై వూగుతోంది.

"అదే! అనుమానంలేదు. దయ్యమే." కాళ్ళూ, చేతులు వణుకుతున్నాయి. దయ్యమింకా వూగుతూనేవుంది. ఇక వెనక్కు తిరక్కుండా పరుగెత్తుకెళ్ళాడు గోపీ. మంచందగ్గరి కెళ్ళినా యింకా వణుకుడు తగ్గలేదు. గుండెలు వేగంగా కొట్టుకుంటూనే వున్నాయ్యి. మళ్ళీ దయ్యంకోసం అక్కణ్ణుంచే చూశాడు కానీ ఆ చీకట్లో ఏమీ కన్పించలేదు.

"అది దయ్యమా? లేక తన భ్రమా?" అనుమాన మొచ్చింది గోపీకి. "దయ్యమే! లేకపోతే అంతఎత్తు కొమ్మ పైకి ఎలా ఎగురుతుంది?" అనుకున్నాడు.

దయ్యాలకు కాళ్ళు వెనక్కు తిరిగి వుంటాయన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. దయ్యం కాళ్ళు చూడనందుక

తన్నుతాను తిట్టుకున్నాడు. పదినిమిషాల్లో నిద్రలోపడి తన "డబ్బుచెట్టు"పై తీయటి కలలు కనసాగాడు. గోపీ

* * *

# 3

ప్రొద్దున లేస్తూనే వాసు ఇంటికి వెళ్ళాడుగోపీ. వాడికి రాత్రి జరిగిందంతా చెప్పేవరకూ గోపీ మనసుండబట్టలేదు. వాసుగాడు ఒక తాయానికి గోపీచెప్పింది నమ్మలేదు.

"నిజంగానా కోస్తున్నావా ?"

"నిజం. వట్టు"

"నిజంగా దయ్యం వూగిందా?"

"నిజంగారా. నీక్కావాలా చెప్తూంట?"

దయ్యాల కథలు అందరికీ చెప్తూన్నా గోపీ దయ్యాన్ని చూశాడంటే వాసుకు నమ్మకం కలుగలేదు.

"ఒరేయ్? మరి దయ్యంకాళ్లు ఎలా వున్నాయి?"

"చూళ్ళేద్దురా. భయంవేసి పరుగెత్తుకొచ్చేశా."

"ఐతే, అది దయ్యం అయ్యుండదు"

"దయ్యం కాకపోతే మరేమిటి?"

"ఏమో నాకేం తెల్సు ? మీ తోటలోకెళ్ళి చూద్దాంరా."

"మరి 'డబ్బు చెట్టు' నాటాక మూడ్రోజులు చూడొద్దన్నావుగా!"

"కిట్టిగాడలా చెప్పాడనుకో..." కాసేపాలోచించాడు వాసు.

"ఇంతకూ మనమేం డబ్బుచెట్టుని చూడ్డానికి వెళ్ళటం లేదుగా! మనం తోటను చూడటానికి వెడదాం."

గోపీకి 'డబ్బుచెట్టు' మొలకెత్తదేమోనన్న అనుమానం వేసింది. ఐనా 'డబ్బుచెట్టు' కొద్దిగా మొలకెత్తి వుంటుందేమోనన్న వుత్సాహంతో, తోటలోకి వెళ్ళడానికొప్పుకున్నాడు.

వాసు, గోపి తోటలో చింతచెట్టు దగ్గరికి వచ్చారు. గోపి 'డబ్బుచెట్టు' నాటినచోటు చూడరాదని ప్రక్కలకు చూస్తున్నాడు కానీ,అనుకోకుండానే అతనికళ్ళు 'డబ్బుచెట్టు' నాటినవేపు తిరిగాయి. మామూలుగానే వుంది.

"ఒరే గోపీ! ఇక్కడ చూడరోయ్!నీదయ్యం! కొమ్మల మధ్యలో యిరుక్కున్న పొడుగాటి పాతచీరని చీరని తీశాడు వాసు.

"ఇది గాలికి వూగుతుంటే నీవు దయ్యమనుకుని వుంటావ్-అంతేనా?" పెద్ద పోలీసులా అడిగాడు వాసు.

గోపీకూడా అలాగే అన్పించింది. కాని వాడి కొష్టుక్కో బుద్ధికాలేదు.

"అదేం కాదులేరా. నేను చూసినదయ్యం చెట్టు చుటూ డాన్సు చేసింది. దయ్యమే చీర ఇక్కడ విడిచి వెళ్ళుంటుంది" బొంకాడు గోపీ.

"దిన్నే దయ్యా మనుకొని వుంటావ్ లేరా."

కాసేపు ఇద్దరూ గోలీలాడారు. విసుగేసింది.

"ఇక పోతారాగోపీ." వెళ్ళిపోయాడు వాసు.

"మూడు దినాలకు చూస్తే ఇంతఎత్తు అయ్యుంటుందని వాసు చెప్పాడు. అంటే దినానికి జానెడన్నా పెరగాలి. భోం చేసి వచ్చిచూస్తే సరిపోతుంది" అనుకున్నాడు గోపీ.

భోంచేసి తోటలోకి వచ్చాడుగోపి. 'డబ్బుచెట్టు' చూడటానికని వస్తే దానికోపం వచ్చి పెద్దదవదని ఒక వుపాయం చేశాడుగోపి. ఒక గోలీనడక్కే పారేసుకు వచ్చాడు. అంటే ఇప్పుడు గోలీకోసం తోటలోకి వెళ్ళవచ్చు నన్నమాట. గోలీకాయ తాను పారేసిన చోటునేవుంది. మెల్లిగా దూరం నుంచి డబ్బు చెటుకోసమై చూశాడు. చిన్న మొక్క దూరం నుంచి డబ్బు చెట్టుకోసమై చూచాడు. చిన్న మొక్క లేచిన గుర్తుకూడా లేదు. వెనక్కు వెళ్ళిపోదామను కున్నాడు. కానీ మనసు రాలేదు. ఇంకాస్త దగ్గరి కెళ్ళాడు. మొలకెత్తుతున్న జాడలేపి లేవు. కాస్త త్వవ్వి చూచాడు. ఊహుఁ. మొలకే లేందే ఇంకాస్త త్రవ్వాడు. మొలకలేదు.

"ఓస్! మూడు దినాలయ్యాక ఠక్కున పెరుగుతుందనుకొని, మళ్ళీ మన్ను వేసి గొయ్యి పూడ్చేశాడు. 'డబ్బుచెట్టు' పైనున్న వుత్సాహం సగం చచ్చింది.

ఆడుకోవడానికి ప్రసాద్ ఇంటికి వెళ్ళాడు.

ప్రసాద్ వాళ్ళింట్లో అప్పుడే శేఖర్, వాసు, కిట్టి, రమణ చేరారు. గోపీ చేరుతూనే 'ట్రేడ్' ఆడటం మొదలుపెట్టారు.

ఆట నాలుగు వరకూ ఆడినా ఏమీ తేలలేదు.

"ఇక చాల్లేరా, విసుగేస్తోంది:" ఇక వుండబట్టలేక అన్నాడు రమణ. నిజానికందరికీ విసుగేస్తోంది, "అవున్రా ఇకచాల్లే." అన్నాడు గోపి. అంతాతీసి ఎత్తిపెట్టేశారు.

"ఒరేయ్! సెలవుల్లో ఎవరన్నా వూర్లకెళ్తున్నారా? అడిగాడు ప్రసాద్.

ఒక్కరూ మాట్లాడలేదు. పాపం, ఎవరూ వెళ్ళేట్టు లేదు. "ఊరికెడితే ఎంచక్కా ఎంత బాగుంటుంది కదరా."

ప్రసాద్ మాటలకు అందరికీ నోట్లో నీళ్ళూరినయ్. తామెక్కడికీ పోనందుకు అందరికీ చింతకల్గింది.

"ఒరేయ్ ప్రసాద్! నీవే వూరికి పోతావురా?" అడిగాడు వాసు.

"ఎక్కడా లేదురా"

"ఐతే మనమంతా కలిసి 'పిక్నిక్' వెడదామా?" ఇది రమణ ఆలోచన."

'పిక్‌నిక్' అంటే ఏమిట్రోయ్ ?" అందరికీ అనుమాన మొచ్చినా ముందుగా అడిగాడు గోపి.

"ఓస్ ! 'పిక్‌నిక్' అంటే తెలీదా ?"

"ఉహుఁ"

నిజానికి రమణకున్నూ కూడా సరిగ్గా తెలీదు, "మరేంలేదేయ్? ఏదైనా తోటకెళ్ళి, అక్కడే భోంచేయడం."

"మరి ఏ తోటకు వెళ్దాం ?" సందేహం వెలిబుచ్చాడు కిట్టి.

"అవునురా మరి ఏ తోట కెడదాం ?" అందరూ అదే మాటన్నారు.

"గోపీ ! మీ తోట కెళ్దాంరా" అన్నాడు వాసు.

"ఛ ! అక్కడ తినేబదులు యింట్లో తినడం మేలు. ఎక్కడైనా దూరంగావున్న తోటకెళ్ళాలి"అన్నాడు రమణ.

"మరి నీవు చెప్పవోయ్" వాసుకు కోపం వచ్చింది.

"అబ్బబ్బ ! పోట్లాడకండోయ్ ! అందరూ ఆలోచించండి" సర్దాడు శంకర్.

ఇంతలో ప్రసాద్ వాళ్ళ నాన్న, వచ్చారు.

"ఏమోయ్! ఏవిటీ గలభా! తెగ ఆలోచిస్తున్నారు" అన్నాడాయన. ప్రసాద్ నాన్నగారంటే పిల్లలకంతా భలే యిష్టం. ఆయనెప్పుడూ పిల్లలపై కోప్పడరు.

"నాన్నా ! మేం 'పిక్‌నిక్' వెళ్ళాలనుకున్నాం కాని మరి ఎక్కడికి కెళ్ళాలో తెలియలేదు."

"పిక్ నిక్కా ? ఎన్నిరోజులోయ్ ?

ఎవ్వరికీ దినాలుగా 'పిక్ నిక్' వెళ్ళొచ్చన్న ఆలోచనే రాలేదు. "ఎన్నిదినాలో ఎలా వెళ్తాం ? ఒక్కరోజే"

"ఒరేయ్ ! అబ్బాయిలూ ! నేను పిక్ నిక్ వెళ్ళటానికి స్థలం చెబుతాను కానీ ఒక్కరోజంటే కుదరదు. కనీసం మూడు నాలుగు దినాలైతే బాగుంటుంది. మీరందరూ వెళ్ళటానికి సిద్ధమా ?"

"ఓఁ ! సంతోషంగా అరిచారందరూ.

"ఇక్కడికి పదిహేను మైళ్ళదూరంలో మా భూము లున్నాయి. ఒక యిల్లు కూడా వుంది. అక్కడి కెళ్తారా ?"

"మరి భోజనం నాన్నా ?"

"ఒరే తిండిపోతూ ! మీరే వండుకోవాలి. అక్కడికి మన పాలేరు సామాన్లన్నీ తెచ్చిస్తాడు."

"నాన్న ! నేనూ, రమాకూడా వెళ్తాంనాన్నా" ప్రసాద్ చెల్లి పార్వతి వచ్చింది.

"యాక్ ! ఆడపిల్లలేంవద్దు." ప్రసాద్ అన్నాడు.

"ఒరేయ్ ! వాళ్ళనూ తీసుకెళ్ళండిరా. మీరేం కొమ్ములు పెట్టుకున్నారా ?"

"ఐ ! ఐ ! మేమూ వస్తాం" అరిచారు పార్వతీ, రమా.

"ఐతే, మనకు వంట చేయటం రాదుకదరా" గోపీ కనుమానం వచ్చింది.

"ఓస ! మేం నిముషంలో చేసేస్తాం" అన్నారు పార్వతీ రమా.

"ఇంకేం ! వాళ్ళనూ తీసుకువెళ్ళండి. మీకు వంటకు సాయం చేస్తారు" అన్నారు ప్రసాద్ నాన్నగారు.

"అవునా వాళ్ళనూ రానివ్వు. అందరూ ఒప్పుకున్నారు

"వంట సమస్య తీరిపోయింది. ఇక మీరంతా వెళ్ళి మీ యిండ్లలో అడిగిరండి" అన్నారు ప్రసాద్ నాన్నగారు.

అంతా యిళ్లకు వెళ్ళారు.

గోపీ 'పిక్‌నిక్' విషయం అమ్మకు చెప్పాడు.

"వెధవలు ! మీ పాటికి మిమ్మల్ని విడిస్తే మరేమన్నా వుందీ ?—— నేనేం పంపను" అంది వాళ్లమ్మ.

"అదికాదే అమ్మా ! అందరూ వస్తారే. వాసు, కిట్టి, శంకర్, రమ పార్వతీ యింకా ప్రసాదు."

"ఎవరొస్తే నాకేం ? నీవేం వెళ్ళొద్దు."

"నాన్నా ! నాన్నా ! పంపవా నాన్న నన్ను " ఏడుపు గొంతుతో అడిగాడు గోపీ.

"చూద్దాం లేరా ! ఇప్పట్నుంచీ ఏమిటి ?"

"ఇంకా చూసేదేంటండీ నే పంపనంటుంటే ! ఒరే గోపీ భోజనానికి రా !"

"నేనేం భోంచేయను. ఫో" కోపం వచ్చింది గోపీకి.

గోపీ నాన్నకు జాలివేసింది. వాణ్ణి చూస్తూంటే.

"పంపరామా ? పాపం; అందరూ వెళ్తూంటే..."

"ప్రసాద్, వాళ్లపాలేరుకూడా అక్కడే వున్నాడమ్మా" గోపీకి ఆశ కల్గింది.

"అబ్బబ్బ ! మీరూరుకోండి. వీణ్ణిలా పంపే పాడు చేస్తున్నారు."

"పిక్నిక్ల కెడితే ఏం పాడైపోరు— ప్రసాద్ వాళ్ల నాన్న చెప్పారు." అన్నాడు గోపీ.

"వాళ్ళు ఆడపిల్లలను పంపుతుంటే వీణ్ణి పంపటానికేం? ఇంట్లో కాస్త గోలన్నా తగ్గుతుంది."

"మీ యిష్టం. ఎలాగైనా పోండి" గొణిగింది అమ్మ.

ఐ నేనూ పోతానోచ్చ !" ఎగురుకుంటూ బయటి కెళ్ళాడు గోపీ.

"ఎనిమిదయింది భోజనానికి రారా" అన్న మాటలు ఎవరికీ వినపడనేలేదు.

అందరూ కష్టపడి యిళ్లలో వొప్పించారు.

"ఎల్లుండి వెళ్లండి" ప్రసాద్ నాన్న చెప్పారు.

వంటకు కావాల్సిన వస్తువులన్నీ సిద్ధపరిచారు పార్వతీ, రమా. పిల్లలంతా వారికి సాయంచేశారు. ప్రసాద్ వాళ్లమ్మ కూడా పిల్లలకు చాలా సాయపడింది.

పిల్లలంతా మూటాముల్లె కట్టుకుని ప్రసాద్ వాళ్ళింటికి చేరారు.

"ఎలారా ప్రసాద్ వెళ్లటం?" అందరూ ప్రసాద్ నడుగుతున్నారు.

"నాకూ తెలియదురా. మా నాన్న ఏర్పాటు చేస్తానన్నారు."

"బస్సులో వెళ్ళాలేమో!" పార్వతి అంది.

"ఔను. బస్సులో ఏంచక్కా వెళ్ళొచ్చు" అందుకున్నాడు వాసు.

"బస్సులో అయితే అరగంటకూడా పట్టదు" అన్నాడు గోపి.

అవునోయ్! అది నిజమే. ఐతే మన ప్రయాణం ఏమంత బాగుండదు" ప్రసాద్ అన్నాడు.

అందరికీ నిరాశ కల్గింది.

ఇంతలో ఓ రెండెడ్ల బండి వచ్చి యింటి ముందాగింది అందులోనుండి ప్రసాద్ నాన్నగారు దిగారు.

"ఒరేయ్! పిల్లలూ! మీరంతా, యిప్పుడు వీన్లోనే 'పిక్ నిక్' వెళ్ళాలి. ఇతనే మన పాలేరు."

పాలేరు బాగా ముసలివాడు. నల్లని ముఖంపై తెల్లని మీసాలు మెరుస్తూ పిల్లలకు ధైర్యాన్నిచ్చాయి. బండీ, పాలేరు పిల్లలకు బాగానచ్చారు. ఇంతకు ముందున్న నిరాశ తొలిగింది.

"హుర్రు! భలేవుందోచ్ బండీ!" అరిచాడు గోపీ. అందరూ అరిచారు.

"అబ్బబ్బ! మరీ అంతగా గోల చేయకండర్రా! తల పగిలిపోతోంది" అంది ప్రసాద్ వాళ్ళమ్మ.

"చేయనీ! వాళ్ళు కాకపోతే మనం చేస్తామా గోల?" అన్నారు ప్రసాద్ వాళ్ళ నాన్నగారు. బండి కదిలింది.

పిల్లలంతా ఓ పాత బంగళా చేరారు. చాలా రోజులుగా అందులో ఎవ్వరూ వున్న జాడలేదు. చుట్టూ పిచ్చి మొక్కలు దిక్కు లేకుండా పెరిగాయి. ఇంటికి రెండు ఫర్లాంగుల దూరంలో ఒక చిన్న కాలువ పారుతోంది. పాలేరు వారికి యిల్లు, వంట సామాన్లు చూపించి వెళ్ళిపోయాడు. పాలేరు యిల్లు ఓ ఫర్లాంగు దూరంలో వుంటుంది. అంతా తమ స్వంతానికే విడవడంవల్ల పిల్లలకు సంతోషంగా వుంది.

"రేయ్. నదికి వెళ్దామా?" అన్నాడు రమణ.

"ఇల్లు శుభ్రం చేయాలి. మట్టికొట్టుకునుంది" అంది పార్వతి.

"మీ ఇద్దరూ యిల్లు వూడ్చండి. మేం. ఆడుకుని వస్తాం" అన్నాడు ప్రసాద్.

"మేమేం చెయ్యం. మీరే చెయ్యండి" అరిచింది పార్వతి.

"ఒరేయ్! ఇలా ఎవరంతకు మీరు పోట్లాడుకుంటుంటే అయ్యే పనికాదు. మనం ఒక ప్లాను ప్రకారం పనిచెయ్యాలి" అన్నాడు గోపీ.

"ఏంప్లాను ?"

"అదేవోయ్! అందరూ కలిసి ఆలోచించాలి.

కిట్టిగాడప్పుడే వెళ్ళి దగ్గరున్న చింతచెట్టెక్కి కూర్చున్నాడు.

"ఒరేయ్ అందరూ యిలా రండ్రా" అరిచారు గోపీ, శంకర్. అందరూ వచ్చారు.

"ముందు మనం ఒక 'లీడర్'ను ఎన్నుకోవాలి. ఆ తర్వాత వాడెలా చెబితే అలావినాలి. తెల్సిందా ?" అన్నాడు గోపి,

"అలాగే" అందరూ అరిచారు.

ఇంతలో మళ్ళీ పాలేరు వచ్చాడు. ఈ మారు వెంట ఓ కుర్రాణ్ణి పిల్చుకుని వచ్చాడు. ఆ కుర్రాడు వీళ్ళ యీడు వాడే.

"బాబూ! యీ అబ్బాయికూడా సెలవుల కిక్కడికొచ్చాడు. మన భూముల కావల వీళ్ల భూములున్నయ్యి. మీ జతకు వుండనివ్వండి" అన్నాడు.

"సరేలే" వొప్పుకున్నారు పిల్లలంతా.

క్రొత్త అబ్బాయి పేరు జాఫర్ కొద్దిసేపట్లోనే వాళ్లలో కలిసిపోయ్యాడు.

"ఊం! ఇక 'లీడర్'ను ఎన్నుకుందాం" అన్నాడు వాసు.

"గోపీ నీవు వుండవోయ్" అన్నాడు కిట్టీ.

"ఊహుం! నేను వద్దు. శంకర్‌ను వుండనీం."

అందరికంటే శంకర్ ఎత్తుగానూ, బలంగానూవుంటాడు. అందరూ శంకర్ 'లీడర్'గా వుండటానికి వొప్పుకున్నారు.

"ఇప్పుడు మనం ఎంతమందివున్నాం?" అడిగాడు శంకర్.

"వాసూ, కిట్టీ ప్రసాద్, రమణా, పార్వతి, రమా: జాఫర్, నువ్వూ, నేనూ అంతా కలిసి తొమ్మిదిమంది" చెప్పాడు గోపి.

"తొమ్మిది మందిలో ముగ్గురు, ముగ్గురు ఒక జట్టు వుండాలి" అన్నాడు శంకర్.

"నేనూ, వాసూ, రమణా, ఒక జట్టోచ్చ్" అరిచాడు. కిట్టీ.

ఒరేయ్! అలాగేం కుదరు? లాటరీ వేద్దాం" సలహా యిచ్చాడు ప్రసాద్. చీటీలో పేరు వ్రాసి లాటరీ వేశారు.

"రమా, పార్వతీ, ప్రసాద్ ఒకజట్టి శంకర్ జాఫర్, కిట్టీ ఒకజట్టూ గోపి, వాసు, రమణ ఒక జట్టు పడ్డారు. పార్వతీ ప్రసాద్ అప్పుడే తగవులాడ్డం మొదలు పెట్టారు.

తగవు లాడకుండా వుండేందుకు గోపి, ప్రసాద్ రమలను ఒకజట్టూ, వాసు, రమణ, పార్వతీలనూ యింకోజట్టు చేశాడు శంకర్.

"ఏదో ఒక జట్టు ఎప్పుడూ యింట్లో వుండాలి. అంటే ఒక జటు తర్వాత యింకోజట్టు యింట్లో వుండాలి. ఒకోజట్టు ఒక్కొక్కమారు వంట చేయాలి. తెల్సిందా?" అన్నాడు శంకర్.

"ఆఁ" అన్నారందరూ.

"ఇప్పుడందరూ కలిసి యిల్లు శుభ్రం చేద్దాం పట్టండి" అందరూ యిల్లు శుభ్రం చేయడానికి మొదలుపెట్టారు.

మధ్యాహ్నం వరకూ శుభ్రం చేసేదానికే సరిపోయింది. వంట చెయ్యడం వాసూ, రమణ, పార్వతీల జట్టుకు పడింది. అంతవరకూ మిగతా వాళ్ళంతా ఎక్కడైనా వెళ్ళొచ్చు, మిగిలిన పిల్లలు కాలువ వొడ్డుకు పరుగెత్తారు. కాలువలో ఆడి ఆడి అలసి పోయారందరూ. కాలువలో చిన్న చిన్న చేపలు కూడా వున్నాయి. చేపలను పట్టుకోవడం పిల్లలకు సరదాగా వుంది. దొరికినట్టే దొరికి తప్పించుకొంటున్నాయి.

గోపీకి ఓ మంచి చేపకనబడింది. దాన్ని పట్టుకోవాలని ప్రయత్నించాడు. అది ముప్పుతిప్పలు పెడుతోంది. దాని వెంట పడి చాలా దూరం అలాగే కాలువలో వెళ్ళాడు. తిప్పి, తిప్పి చివరకు దొరికింది చేప. గోపీ సంతోషంతో "చేప దొరికిందోచ్" అని అరచి చుట్టూ చూస్తే పిల్లలెవరూ లేరు. అప్పుడర్థమైంది గోపీకి తాను చాలా దూరం వచ్చినట్టు.

దగ్గర్లో ఓ పెద్ద కాంపౌండు గోడ సగం పాడుపడింది కన్పించింది. కొంతదూరంలో ఓ పాత భవనం కన్పడుతోంది. ఏముందో చూద్దామని ఒక అడుగు ముందుకు వేశాడో లేదో "భౌ; భౌ"మని అరుస్తూ ఒక పెద్ద కుక్క చెట్లమాటునుంచి వచ్చింది. దయ్యంలాగున్న దాన్ని చూస్తూంటేనే గోపీకి సగం ప్రాణాలు పోయాయి. అలాగే నిలబడి పోయాడు. అదీ నిలబడింది. చేతిలోవున్న చేపను దాని దగ్గరకు విసిరాడు. అది దాన్ని నోట కరచుకుని తోక అల్లాడించి వెళ్ళిపోయింది. ఇక ఆలస్యం చేయకుండా వెనక్కు తిరిగాడు గోపి. అప్పుడు చేపను పట్టే మోజులో దూరం కన్పడలేదు కాని: యిప్పుడెంతో దూరం వున్నట్టు తెలిసింది. కాలువ వెంబడే వెళ్ళి యిల్లు చేరాడు.

ఇంటికి వెళ్ళేసరికి అందరూ గోపీకోసం ఎదురు చూస్తున్నారు. గోపీ జట్టు వాళ్ళను శంకర్ అరుస్తున్నాడు. వెళుతూనే గోపీని కూడా మందలించాడు ఆలస్యంగా వచ్చినందుకు.

"అది కాదురా..." చెప్పబోతున్నాడేదో గోపీ.

"ఇక అవన్నీ అనవసరం. ముందుగా ఎవరితోనూ చెప్పకుండా ఎందుకు వెళ్ళావు?" అన్న శంకరు మాటలతో గోపీ నోరు మూత పడింది.

భోంచేసి అందరూ యింట్లోనే ఆడుకున్నారు. మొదటి జట్టు వాళ్ళు వంట బాగానే చేశారు.

మరుదినం ఇంకో జట్టుకు వంట పని. గోపీ వాళ్ళ జట్టుకు రాత్రికి వంట పని పడింది. గోపీ మళ్ళీ ఆ బంగళా దగ్గరి

కెళ్ళాడు, నిన్న చూసిన కుక్క పరుగెత్తు కొచ్చింది. ఈ రోజేమీ భయం వేయలేదు. జేబులోనున్న బిస్కట్ ముక్క తీసి వేశాడు. కుక్క దగ్గరిగా వచ్చి తోక అల్లాడించింది. గోపీ, కుక్కా మంచి స్నేహితులయ్యారు. గోపీకి ఆ బంగాళా చూద్దామనిపించింది. బంగళా దగ్గరికి వెళ్ళాడు. అంతా పాడు పడివుంది. ఇంకా ముందుకు వెళ్ళాడు. ఎవ్వరూవున్న జాడల్లేవు. మరి కుక్క అక్కడెలా వుందో అర్థంకాలేదు. ఎదుగారు పాత తలుపులు కనబడుతున్నాయి. ధైర్యంచేసి మెల్లిగా తలుపుని త్రోశాడు. 'కిర్రు'మని చప్పుడు చేశాయవి. కాసేపలాగే నిలబడ్డాడు. నిశ్శబ్దం. వెనక్కు తిరిగి చూస్తే కుక్కలేదు. "ముందుకు వెళ్ళామా వద్దా?" అనుకున్నాడు. ఎవ్వరూ లేరేమో! ఇటువంటిచోట ధనం పాతిపెట్టి వుంటారట. కథల్లోనైతే ఏంచక్కా ధనం పిల్లలకే దొరుకుతుంటూంది. ధనంపై ఆశకన్నా. స్నేహితుల ముందు తన సాహసాన్ని చెప్పాలన్న కోరికతో ఒక అడుగు ముందుకువేశాడు. పోతూనే ఒక హాలు అంతా దుమ్ము కొట్టుకునివుంది. పైన గబ్బిలాలు ఎగురుతున్నాయి. ఎవ్వరూవున్న జాడల్లేవు. ముందుకు దారిలేదు. హాల్లోంచి అసలు తలుపుల్లేవు.

నిరాశ కల్గింది గోపీకి. ఐనా గోడలన్నీ వెదికాడు ఎక్కడన్నా రహస్య ద్వారాలు, మీటలూ వున్నవ్యేమోనని. ఉహుఁ. ఎక్కడా లేవు. క్రింద నేలంతా జాగ్రత్తగా చూశాడు ప్రయోజనం లేకపోయింది. భవనం బైటినుంచి చూస్తే చాలా పెద్దదిగా కనబడుతోంది. హాల్లోనుంచి యింక దారి లేదు.

బయటికి వచ్చేశాడు గోపి. కుడి ప్రక్క యింకో గది తలుపులున్నాయి.

"అబ్బ సరియైన ద్వారం దొరికింది" అనుకుని వెళ్ళి తలుపులు త్రోశాడు. అవికదలలేదు లోపల గడియ వేశారు లాగుంది. మళ్ళీ హాల్లోకి వెళ్ళి వెదికాడు. క్రొత్తగా ఏమీ కనపడలేదు. అప్పటికే చాలా సేపయి వుంటుందనిపించింది. అందరూ నిన్నటిలా తన్ను వెదుకుతుంటారేమో నన్న భయంతో యింటికేసి పరుగెత్తాడు, గోపి.

అందరికీ ఆయింటిని గూర్చి చెప్పేద్దామని మొదట అనుకున్నాడు కాని, ఇక అందరూ అక్కడి వెళ్ళాలంటారని ఆ విషయం ఎత్తలేదు.

భోజనాలయ్యాక అందరూ ఆడుకోవాలనుకున్నారు. బయట ఎండ మండిపోతోంది. ఇక యింట్లోనే ఆడుకోవాలి ఇంట్లో వారికి తెలిసిన ఆటలన్నీ ఆడి విసుగెత్తి వున్నారు.

"ఒరేయ్! పోనీ 'ట్రేడ్' ఆడదామా?" అడిగాడు వాసు.

"ఛ! ఛ! వద్దురా 'బోర్' కొడ్తుంది." ప్రసాద్, రమణ ఒకే మారన్నారు.

"ఐతే మరి ఏం చెద్దాం?" అందరికీ అదే ప్రశ్న. 'ఒరేఁ. కాలువ దగ్గరికెళ్దాంరా. ఈ యెండలో చల్లగా నీళ్ళల్లో ఆడుతోంటే......" కిట్టిగాడన్నాడు.

"అవునోయ్! బాగుంటుంది." గో[illegible]ా, జాఫర్, ప్రసాద్ ఒప్పుకున్నారు.

"ఒరేఁ. మాదే 'మెజారిటీ' కాబట్టి కాలువకెళ్దాం పదండి అన్నాడు ప్రసాద్.

కాని శంకర్ ఒప్పుకోలేదు.

"ఇవాళప్పుడు కాలువకేంవద్దు ! ఇంట్లోనే ఆడు కుందాం."

రమణా, ప్రసాద్ గొణుక్కుంటూ ఒప్పుకున్నారు.

మళ్ళీ కథ మొదటికొచ్చింది.

"ఏ మాడాలి ?"

"ఒరేయ్ ! యుద్ధం చేద్దామా?" యిదిగోపీ ఆలోచన.

"యుద్ధం ఎలాగోయ్ చెయ్యటం ?"

"మరేం లేదోయ్. మనం రెండు జట్లుగా విడిపోదాం. ఒకటి భారత్ మరొకటి పాకిస్థాన్. రెండు జట్లూ యుద్ధం చేయాలి."

"కారణం లేకుండా యుద్ధమెందుకు?" అడిగాడు వాసు.

"ఆ మాత్రం తెలియదురా? పాకిస్థాన్, ఇండియా భూభాగం ఆక్రమించింది. ఇండియా జట్టు పాకిస్థాన్ జట్టును ఓడగొట్టితరిమేస్తుందన్న మాట!"

"నేను భారత్ జట్టూచ్చే" అందరూ అరువసాగారు.

"ఇలాకాదు చీట్లువ్రాసి లాటరీ వేద్దాం"

"ఆడపిల్లలు యుద్ధం చేయరుగా, మరి పార్వతీ, రమా ఎలా ?"

"మేం చెరొక ప్రక్కవుండి యుద్ధం చేస్తాం" అన్నది పార్వతి.

"ఆడపిల్లలేం యుద్ధం చెయ్యరు" అన్నాడు ప్రసాద్.

"ఎందుకు చెయ్యరు? ఝాన్సీ లక్ష్మీబాయి చేయలేదా?" అంది రమ.

మీరిద్దరూ చెరొక జట్టుకూ డాక్టర్లుగా వుండండి. గాయపడిన వారికి కట్లు కట్టడం మీ పని అన్నమాట అన్నాడు శంకర్.

పార్వతీ, రమా దీనికొప్పుకున్నారు.

గోపీ, జాఫర్, శంకర్ ఒకవైపు మిగిలిన నలుగురూ ఒకవైపూ పడ్డారు.

"మీకు జాఫర్ నాయకుడు మీరు పాకిస్థాన్ మేము ఇండియా జాఫర్ ముస్లిం గనుక ఎలాగూ సరిపోతుంది" అన్నాడు బాసు.

జాఫర్‌కు కోపం వచ్చింది. "ఛీ! ఛీ! నేను పాకిస్థాన్ వైపేమీ వుండను. భారత్ లోనూ ముస్లింలున్నారు తెల్సా? అందరూ కలిస్తేనే ఇండియా అవుతుంది" అన్నాడు.

"ఔను. జాఫర్ చెప్పింది నిజం. మేము భారత్ మీరు పాకిస్థాన్" అన్నాడు గోపి.

"హోవోయ్! మీకేం కొమ్ములున్నాయా మీరు ఇండియా వైపు వుండడానికి?" అన్నాడు రమణ.

"టాస్ వేద్దాం. ఎవరు గెలిస్తే వాళ్ళు భారత్?" అంది పార్వతి.

అందరూ ఒప్పుకున్నారు.

శంకర్, జాఫర్, గోపీలున్న జట్టే గెల్చింది. పార్వతి లాళ్ళ జట్టుకే వచ్చింది.

యుద్ధం ప్రారంభం చేశారు.

యుద్ధం చాలాసేపు జరిగింది పిల్లలకీ యాట బాగా వుత్సాహంగా వుంది. హోటలో 'భారత్' జట్టు వరండానుంచి పాకిస్థాను జట్టువచ్చి యుద్ధం చేస్తారన్నమాట. తుపాకుల బదులు తలా ఓ కఱ తెచ్చుకున్నారు. "ఢాం! ఢాం! ఢాం" కాల్పులు సాగిస్తున్నారు. అరచి, అరచి అందరికీ గొంతులు నొచ్చాయి. ఎవరూ క్రిందపడలేదు. రమకూ పార్వతికీ పని లేకపోయింది.

ఓఁ. ఇదేమి యుద్ధం! మీాది వుత్తుత్తి తుపాకులు ఎంత కాల్చినా ఎవరూ క్రింద పడరేం!" అంది పార్వతి.

"హుఁ. గుండు, నా గుండెల్లో దూసుకు పోయింది" అరుస్తూ పడిపోయాడు గోపి పార్వతి, శంకర్ గోపీని పిల్చుక వెళ్ళిలోన పడుకోబెట్టారు. పార్వతికి కట్టుకట్టింది. శంకర్ జాఫర్ నక్కడ 'గార్డు'గా నిలబెట్టి వచ్చాడు; పాకిస్థాన్ జట్టు వారు బయట సేద దీర్చుకుంటున్నారు.

ఇంతలో బయట సైకిల్ బెల్లు విన్పించింది. పిల్లలంతా బయటికి పరుగెత్తారు. ప్రసాద్ పార్వతీల నాన్న సైకిలు వేసు

కుని వచ్చారు. గోపీ కట్లుచూసి ఆయన భయపడ్డారు. కాని ఆటలో కట్లని తెలియగానే నవ్వుకున్నారు.

"ఏ మాట ఆడుతున్నారోయ్?"

"యుద్ధమండీ, పాకిస్థానుకూ, ఇండియాకూ."

"మరి యిప్పుడిలా వచ్చేశారేఁ."

"ఇప్పుడే కాల్పుల విరమణ చేశామండీ"

"అలాగైతే సంప్రదింపుల ద్వారా, మరి మీ తగాదాను తీర్చుకోండి" అంటూ లోనికొచ్చారాయన.

లోన జాఫర్ ఒక్కడే పహరా కాస్తున్నాడు. కట్టె తుపాకీ భుజంపైన వుంచుకున్నాడు.

అందరూ 'ఫక్కుమని' నవ్వబోయారు కాని ప్రసాద్ నాన్న వారించడంతో నవ్వు నాపుకున్నారు, శంకర్ చెప్పాడు "జాఫర్, మా క్రొత్త స్నేహితుడండీ, ప్రస్తుతం 'గార్డు' డ్యూటీ పై వున్నాడు."

"గుడ్ ? 'డ్యూటీ' అంటే అలా చేయాలి మీరూ వున్నారు చూడండి. ఎందుకో? ఎవరైనా వస్తేమాత్రం చేసే యుద్ధం విడచి పరుగెత్తుకు వస్తారా? పైగా సిగ్గులేక నవ్వుతున్నారు" అన్నారాయన.

ఎవ్వరూ కిక్కురుమనలేదు. శంకర్ పిలిచాకగాని వచ్చాడు కాడు జాఫర్. ప్రసాద్ వాళ్ళనాన్నగారు సాయంత్రంవరకూ వుండి వెళ్ళియా

*　　　*

# 5

రాత్రి నీళ్లు త్రాగడానికి నిద్రలేచాడు గోపి. అందరూ నిద్రపోతున్నారు. అంతా నిశ్శబ్దం. ఇంతలో కారు వెళ్తున్న శబ్దమయింది.

"ఇక్కడికెలా వస్తాయి చెప్మా కార్లు?" అనుమానమేసింది, ఈ మారు శ్రద్ధగా విన్నాడు. బాగా శబ్దం విన్పిస్తోంది. శబ్దం చేయక తలుపులు తీసి బయటికి వెళ్ళాడు. కారు లాగే వుంది, వస్తోంది. లైట్లు మెరుస్తున్నాయి. లైటుమీద పడకుండా అక్కడున్న చెట్టు వెనకాల నిలబడ్డాడు గోపి. దగ్గరగా వచ్చింది కారు. అబ్బే. అది కారుకాదు. జీపు. లోపలెవరున్నారో కన్పళ్ళేదు కాని

"ఇదో మిష్టర్! కదిలావంటే కాల్చేస్తాం" అన్నమాటలు అస్పష్టంగా విప్పించాయి. జీపు వెళ్ళిపోతోంది. గోపీ వారున్న యింటిముందుగానే వెళ్ళిపోతోంది. గోపీకి భయం వేసింది. ఆ మాటలు తలచుకుంటే వంటి మీద తేళ్ళూ, జర్రూలూ ప్రాకినట్లు వుంది. లోపలికి వెంటనే వెళ్ళి తలుపులువేసుకుందామా అనుకున్నాడు. కాని హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. 'ఆ జీపును వెంబడిస్తే?" ఇక ఆలోచింపక జీపు వెళ్ళిన వేపు పరుగెత్తాడు. దారి ప్రక్కకు తిరిగింది అక్కణ్ణుంచి జీపు మెల్లిగా వెళ్తుండటం కన్పించింది. మసక మసకగా

వెన్నెల కాస్తోంది. దారి బాగానే కన్పడుతోంది. జీపు వెళ్ళి వెళ్ళి ఓ చోట ఆగిపోయింది. దగ్గరే ఓ యిల్లున్నట్టుంది. గోపీ యింకా దగ్గరిగా వెళ్ళాడు. జీపులోని వారు బాగా కన్పడేందుకు దగ్గరున్న చెట్టు ఎక్కి కూర్చున్నాడు: ఇప్పుడు జీపు బాగా కన్పడుతోంది.

జీపులోంచి యిద్దరు దిగారు. ఇంతలో దగ్గరున్న యింట్లోంచి స్ట్రోమాక్సు లైట్లు తీసుకొని ఒక మనిషి వొచ్చాడు. ఇంతలో ఓ పెద్ద కుక్క అక్కడికి వొచ్చింది. కుక్క తను ప్రొద్దున చూసిందే. పాతయింటి దగ్గర కనబడ్డ దాన్ని బాగా గుర్తు పట్టాడు గోపి. ఇంకా స్త పరీక్షగా చూశాడు. ఇలుకూడా అదే. వెనుక భాగం. జీపులోనుంచి దిగిన ఒకవ్యక్తి ఇంట్లోంచి వచ్చిన మనిషీ కలిసి జీపులోనుంచి మూడు మూటలు ఎత్తుకు పోయారు. జీపులోంచి దిగిన యింకో వ్యక్తి వీరి నాయకుడులా వున్నాడు. సిగరెట్ కాలుస్తూ దర్జాగా నిలబడ్డాడు.

"డెవిల్! ఇలారా" అని అతడు పిలుస్తూనే అది పరుగెత్తుకొచ్చింది. దాంతో కాసేపు ఆడుకున్నాడు. తర్వాత ఇంటినుంచి వచ్చిన మనిషిని.

"అన్నీ సరిగ్గా వున్నాయా!" అని అడిగాడు.

"ఉన్నయ్యి బాస్!"

"రేపు యిక్కడున్న యీ భై మూటలూ యింకో చోటికి పంపేస్తాను. ఇప్పుడు తెచ్చినోణ్ణి ఏడవ నంబరు గదిలో వెయ్యి జాగ్రత్త పీడసాఘ్యోడు. ఇక్కడి మన రాహ



స్యాలప్పుడే కొద్దిగా తెలిశాయి. మన్నాపు రాత్రి మనం యిక్కడి మకాం ఎత్తేద్దాం" అన్నాడతను.

"ఎస్. బాస్ !"

వచ్చిన యిద్దరూ మళ్ళీ జీపులో కెక్కారు జీపు వచ్చినదారినే వెళ్ళిపోయింది. గోపి చెట్టుదిగి వెనక్కి వెళ్ళాడు ఇప్పుడు చూస్తే యిల్లు ఎంతో దూరం వున్నట్టనిపించింది. లోపలికి వెళ్ళి ఎవర్నీ లేపకుండా పడుకున్నాడు గోపీ.

ప్రొద్దున లేస్తూనే రాత్రిజరిగిందంతా, అందరికీ చెప్పాడు గోపీ. మొదట ఎవ్వరూ నమ్మలేదు. కానీ బయట జీపు వెళ్ళిన గుర్తులు కనపడ్డంతో అందరూ నమ్మారు.

"వీళ్ళేక దొంగ ముఠాలాగున్నారు. వీళ్ళను పట్టుకోవాలి" అన్నాడు శంకర్.

"అమ్మో దొంగల ముఠానే. వీళ్ళతో మనకెందురా గొడవ" అన్నాడు రమణ.

"ఒరేయ్! నీ కంత భయమేస్తే నీవింట్లోనే వుండు మేం పట్టుకుంటాం" అన్నారందరూ.

"ఒరేయ్! యిద్దరు పాలేరుతో మన వూరికి వెళ్ళి పోలీసు రిపోర్టిస్తే సరి. వాళ్ళేపట్టుకుంటారు." అన్నాడు వాసు.

"పాలేరు లేడు, ఊరికి నిన్ననే చెప్పి వెళ్ళాడు" అన్నాడు ప్రసాద్.

"పోలీసు రిపోర్టివ్వడానికి మన దగ్గర వివరాలేము న్నాయ్యిరా? మనం ముందు వివరాలు సేకరించాలి" అన్నాడు గోపి.

అందరూ దానికి ఒప్పుకున్నారు;"

ఇప్పుడు మనం తొమ్మిది మందివున్నాం. తొమ్మిది మందిలో పార్వతి, రమ, రమణ, యింటిదగ్గరే వుంటారు. మిగిలిన ఆరుగురిని, మూడు జట్లు చేస్తాను. నేనూ, గోపీ ఒక జట్టు. వాసు, కిట్టీ ఓ జట్టూ, ప్రసాద్, జాఫర్ యింకో జట్టు వుంటారు, మూడు జట్లూ వంతులేసుకుని ఆయింటిని కాపలా కాయాలి. ఇంట్లోంచి ఎవరైనా బయటికెళ్ళినా, లేక ఎవరైనా లోనికి వచ్చినా ఒకరొచ్చి యిక్కడ చెప్పాలి. ఏ జట్టుఐనా వెళ్ళి చాలాసేపయినా రాకపోతే యింకో జట్టు వెళ్ళాలి" చెప్పాడు శంకర్. అందరూ తలలూపారు. మొదట అందర్నీ పిల్చుకు వెళ్ళి దూరంనుంచి యిల్లు చూపాడు గోపి. అందరూ తిరిగి వచ్చారు. ఇంటిని కనిపెట్టి వుండటానికి జాఫర్, ప్రసాద్ లను పంపారు. పిల్లలకిక ఆటలమీద వుత్సాహం పూర్తిగా నశించింది. వాళ్లు. ఏం దొంగలయ్యుంటారన్న విషయమే తెగ చర్చించారు.

ప్రొద్దున ఆ బంగళా దగ్గర విశేషాలేమీ జరుగలేదు. ఎవరూ కన్పించలేదు. జాఫర్, ప్రసాద్ వచ్చాక వాసు, కిట్టీలు వెళ్ళారు. వాళ్ళకూ ఎవరూ కన్పించలేదు. రాత్రికి శంకర్, గోపీలు వెళ్ళాలి.

గోపీ, శంకర్ వెళ్ళేప్పుడు జేబులో టార్చి, బిస్కత్తులూ ఒక చిన్న బాకు వుంచుకొని బయల్దేరారు. వాళ్ళు రాత్రి సేపైనా రాకపోతే జాఫర్, ప్రసాద్ అక్కడికి రావాలి, పార్వతి, రమ, రమణల్లో యిద్దరు రాత్రంతా వంతులేసుకుని మేల్కొని వుండాలి.

గోపీ, శంకర్ ఒక మంచి స్థలంచూసి అక్కడున్న చెట్టు నెక్కి కూర్చున్నారు. చాలాసేపు ఏమీ జరుగలేదు. మాట్లాడటానికి వీలులేదు. ఇద్దరికీ బాగా విసుగేసింది. అప్పు డప్పుడూ గుస, గుసలాడుతున్నారు.

కొంతసేపయాక మోటారు కారు వస్తున్న శబ్దం విన్పిం చింది. కాసేపటికొక లారీ వచ్చింది. లారీ లైటు వీరిపై పడు తోంది. ఇద్దరూ ఊపిరి బిగబట్టి నిటారుగా బొమ్మల్లా కొమ్మలపై కూర్చున్నారు. లారీ వాళ్ళను దాటిపోయింది.

"అమ్మయ్య" అనుకున్నారిద్దరూ.

లారీ వెళ్ళి నిన్న జీపాగినచోటే ఆగింది.

లారీలోనుండి ముగ్గురు దిగారు. పెట్రోమాక్సు దీపం తీసుకుని నిన్న వచ్చిన మనిషివచ్చాడు. నలుగురూ కలిసి యింట్లోకెళ్ళి ఏవో మూటలు తేసాగారు.

"గోపీ! యీ మూటలు వీళ్ళు తీసుకుని పోకుండా ఆపేయ్యాలా?"

"ఎలా?"

"అదే ఆలోచించు ముందు మెల్లిగా క్రిందకుదిగుదాం" ఇద్దరూ ఓ పది నిముషాలాలోచించారు. చివరకు శంకర్‌కో ఆలోచన తట్టింది.

"లారీ టైర్లకు గాలి తీసేద్దాంరా."

"అంతకంటే పంక్చరు చేస్తే మేలు."

"ఎలాగైనా సరే. నీ దగ్గర చాకుందా?

"ఊఁ"

"ఐతే ఒకరెక్కడ వుందాం. ఒకరెళ్లి పంక్చర్ చేసి రావాలి."

"నే వెళ్తారా శంకర్"

"సరే. వెళ్ళు.

గోపీ లారీ డ్రైవరు వేపుకు వారి కంట పడకుండా వెళ్లాలని రెండు మూడుసార్లు ప్రయత్నించాడు కానీ సాధ్యం కాలేదు. ప్రతిసారీ ఎవరో ఒకరు బయటికి వస్తున్నారు. వెనక్కి వచ్చాడు గోపి. అంతా చూస్తునే వున్నాడు శంకర్.

"గోపీ! నీ ఇక్కడే వుండ్రా. నే వెళ్లి ప్రయత్నిస్తా"నని వెళ్ళాడు శంకర్. లారీ ఆ ప్రక్కకు చేరడానికి శంకర్‌కూడా సాధ్యంకాలేదు. ఐనా అక్కడే కాచుకుని కూర్చున్నాడు.

మాటలన్నీ ఐపోయాయి. లోపలికెళ్లి ఓ పట్టుపడదాం రండ్రా" అని పిలిచాడొకడు. అందరూ లోనికెళ్లారు.

శంకర్ ఆలస్యం చేయకుండా వెళ్లి మెల్లిగా ఓ చక్రం గాలి నిదానంగా పోయేట్టు మరవదులు చేశాడు. ఇంకో చక్రానికి చాకుతో పంక్చరు చేయడానికి ప్రయత్నించాడు. కాని చాకు మొద్దుగావుంది. చేతకాలేదు. జేబులోనుంచి బేడు తీసి త్వరగా రెండు మూడు చోట్ల కోశాడు. మెల్లిగా వెనక్కుతిరిగి వచ్చాడు.

"పంక్చరు చేశావా.

"పంక్చరు చేశావా?"

"ఒక టైరుకు గాలితీసేశా, ఇంకో దాన్ని మూడుచోట్ల కోశను. మరి లోపలదాకా తెగిందో లేదో?"

ఇద్దరూ మళ్ళీ చూడసాగారు. కాసేపట్లోనే ఆ యింట్లోంచి నరుగురూ తూలుతూ వచ్చారు. ఏదో లాగు తున్నారు స్పష్టంగా వినపడటంలేదు. కాసేపు బీడీలు తాగుతూ నిల్చున్నారు.

"ఇక పోదాము రండి. టైమయింది" అన్నాడొకడు.

"వారు త్రాగార్రా శంకర్" అన్నాడు గోపి.

"అవును కాని నీవు గమ్మునవుండు"

ముగ్గురు లారీ ఎక్కారు. లారీ స్టార్టయి ముందుకు కదిలింది. వచ్చిన దారినే వెళ్ళిపోతోంది. గోపీ, శంకర్ యీ మారు చెట్టువెనకాల నక్కారు.

"ఒరేయ్! గాలితీశావా, లేదా? లారీ వెళ్ళిపోయింది" గొణిగాడు గోపి.

"తీశాన్రా. ఇంకొంత దూరం వెళ్ళాకయినా ఆపా ల్సిందే. త్రాగిన మైకంలో అలాగే విడుస్తున్నారేమో!"

ఇద్దరూ గుడ్లప్పగించి చూస్తున్నారు.

కాలం గడచిపోతోంది. లారీలో వెళ్ళినవాళ్ళ జాడ లేదు. అక్కడున్న తను లో[illegible]ుపులేసుకున్నాడు.

గోపీకి అసహనం ప్ర[illegible]

"శంకర్! ఏంచేద్దాంరా"

"ఏం చేస్తాన్? కాసేపాగు చూద్దాం"

"ఆగి, ఆగి అలాగే తెల్లవారుతుందంతే!"

"అబ్బబ్బ! తొందరపడకోయ్! వాళ్ళువాపసు వస్తారు చూడు. ఇద్దరూ మళ్ళీ చూస్తూ కూర్చున్నారు. కాలం గడచిపోతోంది 'కాని ఎవరూ రాలేదు. లారీ వెళ్ళిపోయిం దేమోనని యిద్దరికీ అనుమానం కల్గింది.

"శంకర్, అటు ప్రక్కగా వెళ్ళి ఆయింటి దగ్గరి కోమారు వెళ్దామా?"

"సరే, పద"

ఇద్దరూ మెల్లిగా నక్కుతూ వెళ్ళారు టార్చిసా యంతోయింటి కొక ప్రక్క చేరారు. ఇంతలో మాటలు విన బడ్డాయి. గోపీ, శంకర్ అక్కడున్న గోడవెనకాల నక్కి చూడసాగారు.

"వెంకటసామీ! లారీ టైర్లో గాలిపోయింది. వాకిలి తీయ్" లోపలున్నతడు వచ్చి తలుపులు తీశాడు.

"లారీ టైర్లో గాలిపోయింది. ఏంచేద్దాం?"

"ఎక్కడ?"

"ఫర్లాంగు దూరంలో"

"పంపు తీసుకెళ్ళండి"

"పంపుతో గాలి కొట్టడం మాటలనుకున్నావా? ఓ గంట పడ్తుంది"

"ఎంతసేపైనా కానీ. మరేం చేద్దాం"

"సరే పంపు తీసుకుని నువ్వూరా పోదాం"

"ఇక్కడెవరుంటారు"

"ఇప్పుడెవడు వస్తాడులేవోయ్! డెవిల్‌ను విడచిరా"

శంకర్, గోపీల గుండెలు ఝల్లుమన్నాయి. కాని అలాగే నిలబడ్డారు. వచ్చిన యిద్దరూ. వెంకటసామిని వెంట బెట్టుకుని పంపు తీసుకుని వెళ్ళిపోయారు. 'డెవిల్'ను విడువ లేదు.

"అమ్మయ్య" అని వూపిరి పీల్చారిద్దరూ.

"శంకర్! లోపలెవరూ లేరు. వెళ్ళిచూద్దాంరా. తలుపులుకూడా తీసివున్నయ్యి" అన్నాడు గోపి,

"వద్దురా ముందు మనవాళ్ళకివన్నీ చెప్పాలి. ఒక పనిచెయ్యి, నీ ఇక్కడే చూస్తూవుండు. నే వెళ్ళి అందరికీ చెప్పి వచ్చేస్తా. వాళ్ళెవరేనా వస్తే మాత్రం మనం ముందున్న స్థలం చేరుకో."

"సరే. త్వరగా రా"

"ఊఁ" శంకర్ వెళ్ళిపోయాడు.

చాలాసేపు కాచుకున్నాడు గోపి విసుగేసింది గంటలు గడచినట్టుంది.

"ఛా! శంకర్‌గాడెప్పుడూ అంతే చాదస్తంనాయలు" అనుకున్నాడు. ఇంకా కాసేపు కాచుకున్నాడు. కాని శంకర్

రాలేదు. ఇక కాచుకోలేక త్వరగా లోనికి వెళ్ళి వచ్చేద్దామను కున్నాడు.

మెల్లగా వెళ్ళి తలుపులు తోశాడు తెరచుకున్నాయి. లోపల చీకటిగా వుంది. టార్చి వేసుకుని ముందు కెళ్ళాడు. కుడివైపు ఒకగది బయట గడియ వేసివుంది. ఏముందో చూద్దామని గడియతీసి, తలుపులు త్రోశాడు. అంతే 'భౌ'మని అరుస్తూ ఓ పెద్ద కుక్క వచ్చి మీదపడింది. అది మీద పడటంతో భయపడి క్రింద పడ్డాడు గోపి. కానీ అంతలోనే 'డెవిల్' తన స్నేహితుణ్ణి గుర్తు పట్టింది. తోక అల్లాడించింది. గోపి దాని తలనిమురి ఓ బిస్కట్ నోట్లో వుంచాడు. వేంకటసామి దీన్ని నిమవడం మరచిపోయినట్టుంది. తిరిగి దాని గదిలోకి పంపడానికి ప్రయత్నించాడు కానీ అది బయటికి పరుగెత్తు కెళ్ళింది.

ఇక చేసేదిలేక ముందుకెళ్ళాడు. ఇంకోగది కనబడింది గోపీకి ఈ మారు జాగ్రత్తగా తలుపుల సందుల్లోంచి చూశాడు. ఒక చిన్న కొవ్వొత్తి వెలుగుతోంది. తలుపులు తీసి లోని కెళ్ళాడు. గది మూలలో ఓ పెద్ద రంధం వుంది. లోపల కటికటి చీకటి. తన టార్చిసాయంతో లోపలున్న మెట్లు దిగాడు. టార్చి లేకపోతే అసలు కన్పించదు. ఆలోచించకుండా లోనికి దిగాడు కాసేపటికి మెట్లయిపోయాయి, లోన సొరంగంలా వుంది. మళ్ళీ అక్కడో తలుపువుంది. తలుపు తీసుకుని లోనికి వెళ్ళాడు. అదొక చిన్నగది.

కళ్ళు జిగేలు మన్నాయి. గోపీకి గదినిండా నూరు రూపాయల నోట్లు కట్టలు, కట్టలు పడివున్నాయి. "ఓ, దొంగ నోట్లన్నీ" ఒక నోటు తీసుకుని జేబులో వుంచుకున్నాడు. ఇంకా ముందుకు వెళ్ళాడు, ఒక బల్లపైన ఐదారు పిస్టల్సూ, కత్తులూ వున్నయ్యి. తానెక్కడున్నదీ మరిచాడు. ఒక పిస్టలు పట్టుకుని "ఏం చక్కా బాగుందని చూస్తున్నాడు. ఇంతలో తలపై దభీమని ఏదో పడింది.

*   *   *

## 6

శంకర్ యింటికి వెళ్ళి జరిగిన విషయం అందరకూ చెప్పాడు. "మేమూ వస్తాం" అన్నారందరూ.

"ఇద్దరు మాత్రం రండి. మిగతా వాళ్ళిక్కడే వుండండి" అన్నాడు శంకర్. ప్రసాద్, జాఫర్‌లను రమ్మన్నాడు. పార్వతీ, రమా అందరికీ 'టీ' చేసి యిచ్చారు నిద్ర రాకుండా.

శంకర్, జాఫర్, ప్రసాద్ బయల్దేరారు. వారొచ్చి చూస్తే అక్కడ గోపీలేడు. కుక్క భయం గొల్పుతూ యింటి ముందు తిరుగుతోంది. గోపీ ఏమయ్యాడు? తామేం చెయ్యాలి?

ముందుకు వెళ్ళి చూద్దామనుకున్నారా గాని 'డెవిల్' ముందు పడటానికి ఒకరికీ ధైర్యం చాలలేదు. అలాగే దూరం నుండే చూస్తున్నారు. ఇంతలో వెంకటసామి వచ్చాడు చేతిలో పంపు వుంది. "లారీ పంక్చరు చేశారు వెధవలు" అని గొణిగాడు.

"ఆయ్! 'డెవిల్'! బయటికెలా వచ్చావ్? నేను లోనే వుంచానే!" అని గట్టిగా అరిచాడు.

శంకర్ వాళ్ళు శ్రద్ధగా చూస్తున్నారు.

వెంకటసామి డెవిల్‌తో సహా లోనికెళ్ళాడు. వేసిన తలుపులు మరి తెరువలేదు. పొద్దుటి వరకూ కాచుకున్నా తలుపులు తెరువలేదు. ఇక చేసేది లేక యింటికి వెళ్ళి వాసూ కిట్టీలను పంపారు.

శంకర్, జాఫర్, ప్రసాద్, రమణా, రమా, పార్వతీ, కలిసి బాగా ఆలోచించారు. "గోపీని వాళ్ళు పట్టుకుని వుంటారేమో! ఎవరైనా వెళ్ళి పోలీసులకు చెప్పాలి లేకపోతే ప్రమాదం" అన్నాడు రమణ. అందరూ దానికి ఒప్పుకున్నారు.

"ఒకేయ్. మధ్యాహ్నం వరకూ చూద్దాం ఆలోపల గోపీ వస్తాడేమో చూద్దాం. వచ్చినా, రాకపోయినా యిద్దరు మన వూరుకెళ్ళి పోలీసుల్ని తీసుకు రావాలి. లేకపోతే దొంగలీరోజే వెళ్ళిపోతారు" అన్నాడు శంకర్.

"నేనూ, జాఫర్" వెళ్తాం అన్నాడు ప్రసాద్.

"సరేలే చూద్దాం" అన్నాడు శంకర్.

వాసూ, కిట్టీ ఆ యింటి దగ్గరే చాలాసేపు కాపలా కాశారు. విసుగెత్తి పోయింది. ఇంతలో ఓ మనిషి తలుపులు తీసి బయటికి వెళ్ళాడు. "ఒరే కిట్టీ! వీడే వెంకటసామి అయ్యుంటాడు. ఇక యింట్లో ఎవరూ వుండరు.లోనికెళ్దామా?" అన్నాడు వాసు.

"చూద్దాం ఉండవోయ్! మళ్ళీ వాడొచ్చేస్తే" అన్నాడు కిట్టి.

ఇద్దరూ చాలాసేపు చూశారు. వెంకటసామి రాలేదు. తలుపులు తెరచివున్నాయి.

"ఒకరు వెళ్ళి ఒకరిక్కడే వుందామా?" అన్నాడు కిట్టి.

"వద్దురా. ఒకడేనైతే ప్రమాదం. ఇద్దరూ వెళ్దాం"

"సరే"

అందులోకలా వెళ్ళారో, లేదో ఎవరోవస్తున్న చప్పుడైంది. అలాగే నక్కారిద్దరూ ఊపిరి బిగబట్టి నిలబడ్డారు. పాదాల చప్పుడు దగ్గరయింది. ఎవరో వచ్చారు.

"తలుపులు వేయడం మరచానే" గొణుక్కుంటూ తలుపులు వేసుకొని వెళ్ళాడు. కొంతసేపు గడిచింది. పాదాల చప్పుడు దూరమయింది. ఇంకాసేపయ్యాక వాసు వెళ్ళి తలుపులు తీయబోయ్యాడు కానీ అవి రాలేదు. బయట గడివేసినట్టుంది.

"చచ్చాంరా దేవుడా మనమూ యిరుక్కుపోయామే!" అనుకున్నారు. ఇద్దరికీ భయం వేసింది. గాలి రావడానికి బాగా

ఎత్తులో గుండ్రని రంధ్రం వుంది అంతే ఇక తప్పించుకునే మార్గం లేదు. ఇక చేసేది లేక గోపి అన్నా కనబడుతాడేమో నన్న ఆశతో ముందుకు వెళ్ళారు. దారికి రెండు ప్రక్కలా గదులు తలుపులు వేసి వున్నాయి. కాని వాసు, కిట్టీ, వాటి జోలికి పోలేదు బాగా ముందుకు పోయేసరికి గోడ అడ్డం వచ్చింది. ఇకముందుకు దారి లేదు అక్కడే కుడి ప్రక్కన ఒకటి, ఎడమ ప్రక్కన ఒకటి రెండు గదులున్నాయి కుడివేపుగది గడియతీసి లోని కెళ్ళారు. చీకటిగా వుంది. పైన ఎత్తులోనున్న కిటికీ చిన్న నుంచి వెలుతురు కొద్దిగా వస్తోంది, ఆ కిటికీ కూడా తలుపుల్లేవు. వృత్తా కారంలో వుంది.

కాసేపటికి ఆ చీకటికి వారి కళ్ళు బాగా అలవాటు పడ్డాయి, ఇప్పుడన్నీ బాగా కనిపిస్తున్నాయి. గది అంతా చూస్తున్నారు.

“వాసూ! ఏదో మూట చూడోయ్!” అని అరిచాడు కిట్టీ.

“గోపినేమో!” వాసు. కిట్టీ అతని దగ్గరకెళ్ళారు. కాని అది గోపీ కాదు. ఎవరో పెద్దతను. బందీగా వున్న అతని నోట్లో గుడ్డలు పెట్టి కర్రాడు చేతులూ, కాళ్ళూ కట్టివేశారు. వాసు ఆయన నోట్లోంచి గుడ్డలు తీసేశాడు.

“హుష్! అబ్బాయిలూ! ఏమిటలా అరుస్తున్నారు. ఇక పైనన్నా మెల్లిగా మాట్లాడండి”

“మీరెవరు?” కిట్టీ అడిగాడు.

అతను నవ్వి, "మీ స్నేహితుణ్ణి! ముందు మీ రెవరో చెప్పండి ఆలస్యం చెయ్యొద్దు ప్రమాదం!" అన్నాడు.

వాసు, కిట్టీలు తాము వూరినుండి వచ్చింది మొదలు జరిగిందంతా క్లుప్తంగా చెప్పారు.

అతను, "ఐతే యీ రాత్రే పారిపోవాలని ప్లాను వేశారన్నమాట. హుఁ. యీ 'వేటకుక్క'ను తప్పించుకుని ఎలా వెళ్తారో నేనూ చూస్తాను. మీరు నాకు సాయం చెయ్యాలి" అన్నాడు.

"మీరు దొంగలాండ్రీ?"

"అవును. నేను సి. ఐ. డి. ని. వీరి సంగతులన్నీ నెల, నుండి కని పెడ్తూనే వున్నా."

"సి. ఐ. డి. నా?" వాసు, కిట్టీలకు ఆశ్చర్యం కల్గింది. బాగా ధైర్యం వచ్చింది.

"ఐతే మీ కట్లు విప్పేస్తాం వెళ్ళివాళ్ళను పట్టుకుందామా?" అన్నారు.

"అబ్బే! అలా తొందర పడరాదు మొదట తలుపులు వేసి వచ్చి నా కట్లు విప్పండి" అన్నాడు సి. ఐ. డి.

వాసు వెళ్ళి తలుపు వేశాడు.

"వేటకుక్క ఎవరండీ?" అడిగాడు. కిట్టీ.

ఆయన నవ్వి. "అదా నాకు దొంగలిచ్చిన బిరుదు" అన్నాడాయన ఇద్దరూ కలిసి ఆయన కట్లు విప్పారు. ఆయన కాసేపు మౌనంగా ఆలోచించాడు.

"అబ్బాయిలూ! నే చెప్పేది శ్రద్ధగా వినండి. మీరిప్పుడు బయటికి వెళ్ళి మీ వాళ్ళతో కలిసి ఎవర్నైనా మీ

రింతకు ముందనుకున్నట్టు పోలీసు స్టేషనుకు పంపాలి. మీకీపని చెయ్యగలరా ?"

"ఓఁ మరి మీరు బయటికి రారాండీ"

"ఊహుఁ. నేనొస్తే వాళ్ళకు అనుమానం కలిగిపారి పోరు" అని చెప్పి తను వేసుకున్న బూటు విప్పాడు. సాక్సు తీశాడు. లోపలపదారు కాగితాలురెండుపది రూపాయల నోట్లు కాలికికట్టబడివున్నాయి. చీకట్లో సరిగ్గా కనబటంలేదు. సి. ఐ. డి. జేబులోంచి అగ్గిపెట్టెతీసి ఒక పుల్ల వెలిగించి వాసును పట్టుకోమన్నాడు. ఆ వెలుతుర్లో ఒక కాగితం తీసుకుని మిగిలిన వలాగే పెట్టేశాడు.

"ఇది తీసుకెళ్ళి పోలీసులకు చూపి, జరిగిందంతా చెప్పండి" అన్నాడు సి. ఐ. డి. "మరి మా గోపీ?"

"మీరేం భయపడకండి. ఎక్కడో ఒక చోట కట్టేసి వుంటారు. ఇక ఆలస్యం చేయక మీరు బయట పటాలి"

బయటికి వెళ్ళటం ఎలాగని ముగ్గురూ రెండునిముషాలాలోచించారు. చివరకు సి. ఐ. డి. కిట్టీని తన భుజం పైకి క్కించుకున్నాడు. కిట్టీ అక్కడినుండి కిటికీలా వున్న రంధ్రం చేరాలని ప్రయత్నించాడు కాని సాధ్యంకాలేదు.

"నీవు ,కిట్టీ పైనెక్కి ఆ రంధ్రం చేరాలి" అన్నాడు సి. ఐ. డి. అని కూర్చున్నాడు. వాసు మొదట ఆయన భుజం ఎక్కాడు. ఇప్పుడాయన భుజంపై వాసూ,కిట్టీ యిద్దరూ వున్నారు. ఆయన లేచి నిలబడ్డాడు. వాసు కిట్టీ భుజంపై కాలుంచి అతికష్టంపై రంధ్రమన్నందుకున్నాడు. కాని అక్కడ పట్టుకోవడానికి కేమీ లేనందున చేయిజారిపోతోంది అదృష్టవ

ఞాతూ రంధ్రం వాసు పట్టేంతవుంది. వాసు పట్టు చేజిక్కించు కుని రంధ్రంలో కెక్కి కూర్చునేందుకో పదిహేను నిముషాలు పట్టింది. బాగా గోడలెక్కే అలవాటు యిక్కడ పనికి వచ్చింది కాళ్ళు బయటికి విడచి దూకడానికి సిద్ధంగా కూర్చున్నాడు.



సి. ఐ. డి. కిట్టీని క్రిందకు దింపి

"గుడ్! సి ఐడి మాకగలవా?" అని అడిగాడు వాసుని.

"ఊఁ. యిక నాకేనా?" అన్నాడు వాసు.

"సరే. జాగ్రత్తగా వెళ్లు- కిట్టీ యిక్కడే వుంటాడు."

కిట్టీ వేపు తిరిగి, "త్వరగా నా కట్లు వదులుగా కట్టి నువ్వు వెళ్ళి, ఓ మూల దాక్కో" అన్నాడు సి. ఐ. డి. ఆయనలా, అన్నాడో, లేదో బయట 'ఢబ్బు'మని వాసు దుమికిన చప్పుడైంది. సి. ఐ. డి. ఎందుకలా చెప్పాడో అర్థమైంది. అప్పటికే ఆయన కట్లు కట్టి మూల కెళ్ళి దాక్కున్నాడు కిట్టీ.

అంతలో తలుపులు తీసుకుని, ఓ మనిషి వచ్చి,

"ఇక్కడా ఎవర్నూ లేరే" అని వెనక్కు తిరిగాడు. వాసు మూలల్లో కెళ్ళా అక్కడంతా దుమ్ము కొట్టుకొని వుంది ఆ దుమ్ము ముక్కుల్లో దూరి 'హాఛ్' అని తుమ్మాడు కిట్టీ.

"ఎవరక్కడ?" అని వచ్చి కిట్టీని పట్టుకున్నాడతను.

కిట్టీ భయంతో గడగడ వణుకుతున్నాడు.

"ఈ పిల్లల ముఠా ఎక్కడి నుండి వచ్చారో! అగు నీ పని చెబుతా. నువ్వేనా దుమికిందే" అంటూ త్రాట్లతో కట్టి పడేశాడు. అనుమానం వచ్చి సి. ఐ డి. కట్లు చూసి అవి కూడా బిగించి కట్టి వెళ్ళిపోయాడు.

వాసు యింటికి పరుగెత్తు కెళ్ళాడు. వాసును చూస్తునే

అందరూ చుట్టూ మూగారు. జరిగిందంతా గసపోసుకుంటూ చెప్పాడు వాసు.

"ఐతే మరి మనవూరికెవరెళ్తాం?" అడిగాడు శంకర్.

"నేనూ, జాఫర్" అన్నాడు ప్రసాద్.

"పదిహేను మైళ్ళుంది. తెలుసా?" అన్నది రమ.

"ఓ, మాకేం భయం లేదు. ఇరవై మైళ్ళైనా వెళ్ళగలం" అన్నాడు జాఫర్.

"ఏంరా వెళ్తారా,? నేనూ రానా?" అడిగాడు. శంకర్.

"నీవేం వద్దులే. ఇక్కడుండు. మేం వెళ్తాం" అన్నాడు ప్రసాద్.

ప్రసాద్, జాఫర్ భోంచేసి సి. ఐ. డి. యిచ్చిన కాగితం తీసుకుని బయల్దేరారు.

ఇక శంకర్, వాసు; రమణా. రమా, పార్వతీ, మిగిలారు.

కిట్టీ, గోపీ దొంగల యింట్లో యిరుక్కుపోయారు.

"ఇప్పుడు మనం ఐదుగురంవున్నాం. పార్వతి, రమణా ఒక జట్టు, వాసు, రమ ఒక జట్టు, నేనొక్కడింకో జట్టు వుండి ఆ యింటికి కాపలా కాయాలి" అన్నాడు శంకర్.

ఆ దినం ప్రొద్దుగడిచే వరకూ విశేషాలేం జరుగలేదు. పోలీసులొస్తారేమో అనుకుంటే వాళ్ళూ రాలేదు. పిల్లలకు విసుగెత్తింది.

జాఫర్, ప్రసాద్ డంగ్గాలు పలికి వెళ్ళారు కాని ఐదు మైళ్లు వెళ్ళేసరికి కాళ్లు నొవ్వడం మొదలెట్టాయి. ఐనా అలాగే కాసేపు నడవడం, కాసేపు పరుగెత్తడం. అంతా చేతకాకపోతే కూర్చోవడం చేస్తున్నారు. అలా పదిమైళ్ళు వెళ్ళేసరికి వారికిక వెళ్ళలేమన్పించింది. ఇంకా ఐదు మైళ్ళు వెళ్ళాలి. ప్రసాద్ కాలిలో ముల్లు గుచ్చుకుని కుంటుతున్నాడు ఎండలో వెళ్తున్నారేమో, నాలుక పిడచకట్టుకుపోయింది. చచ్చేంత దాహం వేస్తోంది. దారిలో ఎక్కడా నీళ్లు లేవు. అలాగే అవస్థ పడుతూ పూరుచేరేసరికి చీకటి పడుతోంది. ఎవరో్న అడిగితే 'పడయ్యిందిన్నాడు.

"ఒరేయ్ ప్రసాద్! మనం మీ యింటికెళ్ళి అంతా చెప్పి మళ్ళీ పోలీసు స్టేషనుకెళ్ళాలంటే గంట సేపన్నా పడ్తుంది. ఒకేమారు పోలీసుస్టేషను కేళ్దాం అన్నాడు జాఫర్.

ప్రసాద్ అస్సలు నడువలేక పోతున్నాడు.

"సరే అలాగే చేద్దాం" అన్నాడు.

ఇద్దరూ దగ్గరున్న పోలీసుస్టేషు చేరేసరికి అక్కడ ఓ కానిస్టేబులు మాత్రం వున్నాడు.

"సబిన్‌స్పెక్టరు గారులేరా?" అడిగాడు జాఫర్.

"లేరు. వస్తారు. ఏం పని!" అడిగాడతడు.

జరిగిందంతా చెప్పారిద్దరూ. అతడు ఎంత చెప్పినా నమ్మలేదు. అతన్ని ఒప్పించే లోపల సబ్ యిన్‌స్పెక్టరే వచ్చాడు. మళ్ళీ ఆయనకు మొదటినుంచీ జరిగిందంతా

చెప్పారు. ఇంతలో సి. ఐ. డి. యిచ్చిన కాగితం జ్ఞాపకం వచ్చింది. తీసి చూసారు.

"అబ్బా! చాలా పెద్ద దొంగలేల్లాగున్నారే. నీ వప్పుడే వచ్చి ఎందుకు చెప్పలేదోయ్ ఫోర్ట్వంటీవన్. ఇప్పుడు జీప్ కూడా పంపేశాను. అది వచ్చేవరకూ కాచుకూర్చోవాలి. ఎనిమిది మందిని సిద్ధం కమ్మను" కానిస్టేబులుపై విరుచుకుపడ్డాడాయన అందరూ జీపు కోసం కాచుకు కూర్చున్నారు.

*　　　*　　　*

# 7

రాత్రయ్యాక ఆ యింటి నుంచి తమ యింటికి ప్రతి మారూ రావడం కష్టమని శంకర్ వాళ్ళొక వుపాయం చేశారు. వాళ్ళు ఆ యింటిని కనిపెట్టి వుండే స్థలానికి కొద్ది దూరంలోనే ఒక పెద్ద బండవుంది. దాని వెనుక కూర్చోవడానికి స్థలం చేసుకున్నారు. అందరూ అక్కడికి వెళ్ళారు: ఇంటిని కనిపెట్టడానికి వెళ్ళిన వాళ్లు అక్కడికే వస్తారు. తర్వాత ఇంకో జట్టు వెళ్ళాలి,

ఇంతలో దూరంగా కారు వస్తున్న చప్పుడు వినిపించింది. అక్కడుండటం ముఖ్యమని శంకర్, వాసుని పిల్చుకుని

యింటిదగ్గరకు చేరాను, మిగిలిన ముగ్గురూ రాత్రి వెనకాలే వున్నారు.

ఒక కారువచ్చి ఆగింది. అందులో నుండి ముగ్గురు దిగారు. వెంకటసామి యథాప్రకారం దీపం తీసుకు వచ్చాడు. అందరూ లోనికెళ్ళి తలుపు వేసుకున్నారు.

శంకర్, "నేనాయింటి దగ్గరికి వెళ్తాను. నీవు వెళ్ళి మిగిలిన వారిని వెంట బెట్టుకు వచ్చి యిక్కడే వుండు పోలీసు లొచ్చేలోపల వీళ్ళు వెళ్ళిపోకుండా ఎలాగైనా ఆపాలి" అని నాసుకు చెప్పి ముందుకు వెళ్ళాడు. శంకర్ వాళ్ళు వెళ్ళిన చోటుకు వెళ్ళక యింటి వెనక్కు వెళ్ళాడు గోపీ మొట్ట మొదట ఆ యిల్లు చూద్దామని వచ్చినప్పుడు వెళ్ళింది ఆవైపునే, శంకర్. కూడా మొదట గోపీ వెళ్ళిన హాలులో కెళ్ళి వెనక్కు వచ్చాడు. పడి ప్రక్కన వున్నగది. తలుపులు తీసి వుండే అందులో కెళ్ళాడు. అంతా చీకటిగావుంది శంకర్ తెచ్చిన 'టార్చి' బాగా వుపయోగపడింది. ఆ గదినుంచి, యింకో గదిలోకి తలుపులున్నాయి. అందులోకి వెళ్ళాడు.

అక్కడా ఎవ్వరూ లేరు. కాని ఎవ్వరో మాట్లాడిన శబ్దం వినిపించింది. శ్రద్ధగా విన్నాడు శంకర్. కిటికీ కావల వున్నగదిలోంచి వినవస్తున్నాయి మాటలు.

"ఐతే, యీ వేటకుక్కకి పిల్ల కుంకలు సాయమన్న మాట. అందర్నీ నల్లుల్ని చంపినట్టు చంపేస్తా ఏమనుకున్నారో!"

కిటికీ బాగా ఎత్తులోవుంది. శంకర్‌కి అందదు. ప్రక్క హాల్లో ఓపాత చెక్కపెట్టె పడుంది. అందులో ఏమీలేదు. శబ్దం చేయకుండా వెళ్ళి తెచ్చుకుని కిటికీక్రింద నిలువుగా నిలబెట్టాడు శంకర్, దాని పై కెక్కిచూశాడు. ఇప్పుడవతలి గది బాగా కనబడుతోంది.

ఒకడు కుర్చీలోకూర్చుని దర్జాగా సిగరెట్ పీలుస్తున్నాడు. చేతిలో పిస్టల్ తళతళ లాడుతోంది. క్రిందఒకమనిషిని కట్టి పడేశారు. సి. ఐ. డి కాబోలు. పెట్రోమాక్సులైటు కాంతిలో అంతా బాగా కన్పిస్తోంది ఇద్దరు నిలబడివున్నారు.

"ఆ కుఱవాణ్ణిలా పట్టుకురండి" ఆజ్ఞాపించాడతడు. గోపిని తెస్తారేమోనని చూస్తున్నాడు శంకర్ కానివాళ్ళు తెచ్చింది కిట్టీని. గోపీజాడేలేదు.

"చెప్పవోయ్! మీరెంతమంది వున్నారు?" అడిగాడు దొంగలనాయకుడు.

"నేనేం చెప్పను" అన్నాడు కిట్టీ.

'ఛళ్ మంది కిట్టీచెంప. దీపంకాంతిలో చెంప పై వేళ్ళ గుర్తులు స్పష్టంగా కనబడుతున్నాయి. కిట్టీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి–కాని ఏడవలేదు. చేతులుకట్టేసి కిట్టీని కొడుతూంటే, శంకర్ వళ్ళు మండిపోయింది కోపంతో. నాలుగు రాళ్ళు తెచ్చి వాడిబుర్ర పగులగొడదామా అనుకున్నాడు - కాని సమయంకాదని వూరుకున్నాడు.

కిట్టీ "చెప్తా కొట్టకండిమేంముగ్గురమున్నాము" అన్నాడు. వాళ్ళు నమ్మినట్టే కన్పించారు.

"భలే ట్రిక్, చేశావోయ్" మనసులోనే అభినందించాడు శంకర్. ఎందుకంటే 'ఇద్దరే' అని చెప్తే వాళ్ళెలాగూ నమ్మరు.

"ఐతే మూడో వాడేడీ?"

"ఏమో తెలియదండీ"

"ఏయ్ చెప్తావా లేదా వెధవా"

"తెలియదండీ- ఊరికెళ్ళాడేమో"

డామిట్! ఇలాకుదర్దు. నీ పని చెప్తానుండు" అంటూ కాలుతున్న సిగరెట్ తీసి కిట్టీ చెంపపైనుంచాడు దొంగల నాయకుడు.

"అమ్మా" అని అరిచాడే కానీ కిట్టీ జవాబు చెప్పలేదు. శంకర్ యిక ఆగలేకపోయాడు. త్వరత్వరగా పెద్దపెద్ద రాళ్ళేరుకుని జేబులునింపాడు. చేతుల్లో మరిన్ని తీసుకుని కిటికీని చేరాడు.

కిటికీనుండి చూసేసరికి శంకర్ గుండెలవిసాయ్. అగ్గిపుల్ల గీసి కిట్టీ కళ్ళముందు పెట్టాడు వాడు.

"చెప్పు చెప్పకపోతే నీ కళ్ళు పోతాయ్"

మండుతున్న అగ్గిపుల్ల కిట్టీ కళ్ళను సమీపించింది.

"అమ్మా" అన్న అరుపు విన్పించింది. శంకర్ అనుమానంగా చూశాడు. తను వేసిన రాయి గురి తప్పలేదు. దొంగల నాయకుడు తల పట్టుకుని కూర్చున్నాడు అగ్గి...

ఎప్పుడో ఆరిపోయింది. ఆశ్చర్యంతో చూస్తున్నాడు కిట్టి.

"పోయి,ఆగదిలోవున్న యింకోణ్ణి పట్టుకోండి మొదటి వాడి లాగే వీణ్ణి యమలోకానికి పంపిద్దాం" అన్నాడు.

ఈ మాటలు విన్న శంకర్ భ్రమాన్పడి పోయాడు. అంటే గోపీని చంపేశారన్నమాట. దుఃఖతో పరుగెత్తుకు పోవాలన్న ఆలోచన కూడా రాలేదు. ఎదురు తిరుగక దొంగ లకు లొంగిపోయాడు.

"పిళ్ళ ముగ్గుర్ని తీసుకెళ్ళి కార్లో వేయండి.తొందరగా వెళ్ళకపోతే ప్రమాదం. ఈ పిల్ల లేమంచేశారో" అన్నాడు దొంగల నాయకుడు.

"మే మెలారావాలి బాస్?"

"జీపులోరండి"

సి. ఐ. డి, ని కిట్టి శంకర్‌లను ఒక్కొక్కరినే తీసుకు వెళ్ళి కార్లో వేశారు. బయట జీపుకూడా వచ్చివుంది. ఇదంతా చూస్తూనేవున్నారు వాసు, రమణా, రమా, పార్వతి. మూడు మాటలు కార్లోవేస్తూనే కారుస్టార్టయింది.

ఇంతలో ఎక్కణ్ణుంచి వచ్చిందో "భౌ, భౌ" మని అరుస్తూ డెవిల్ కారి వెనుకపడింది. భయంతో ఎక్కడ పరు గెత్తుతున్నారో తెలియక కారు ఎదురుగా వెళ్ళారువారు.

కారాపి చేతిలోపిస్టల్‌తో దొంగలనాయకుడు బయటికి

వచ్చారు. అనుచరులొచ్చి ఒకరొకర్నే కట్టి కారులో పడ వేశారు.

జాఫర్, ప్రసాద్ పోలీసు బలగంతో జీపులో బయల్దేరే సరికి రాత్రిచాలా అయింది. ఇద్దరికీ భోజనంలేదు. దగ్గరున్న హోటలుకెళ్ళి టిఫిన్ తినివచ్చారు. ప్రసాద్ కాలు వాచి పోయింది. జోరుగా వెడుతున్నారు పోలీసులు, జీపుని.

*　　　　*　　　　*

గోపీకి మెలకువ వచ్చేసరికి తలభారంగావుంది. తడిమి చూసుకుంటేరక్తం గడ్డకట్టివుంది. ఎప్పుడుతిన్నాడో ఆహారం, వళ్ళంతా నీరసంగావుంది. చేతిలో అప్పుడు చూస్తున్న పిస్టల్ అలాగే వుంది. కాసేపు ఏం జరిగిందోకూడా అర్ధంకాలేదు. జేబులోనున్న బిస్కట్లు చప్పరిస్తూ గదిబయటికొచ్చాడు. కాళ్ళుతడబడుతున్నాయి. ఇంతకు ముందువున్న దొంగనోట్లు కట్టడలేవు. గోపీ చనిపోయాడనుకుని దొంగలు తలుపులు వేయకుండా వెళ్ళారు.

గోపీ భూగృహంనుంచి బయటికి వచ్చినా ఎవరూ కన్పళ్ళేదు. ఏదో జరిగి వుంటుందన్న భయంతో బయటికి పరు గెత్తుకు వచ్చాడు. వాకిటిదగ్గర 'డెవిల్' కనబడితేక ఆశ్చర్యం చింది. ఇక్కడెక్కడో వుంటారని అలాగే ముందుకెళ్ళాడు. చేతిలో పిస్టలు అలాగేవుంది. అప్పుడే 'స్టార్టయి' వెళ్తున్న కారు, జీపు కన్పించాయి. కారులోంచి ఎవరో ఆడపిల్లలు ఏడుస్తున్న శబ్దం విన్పించింది.



ఇక ఆలోచించకుండా జీపును గురివృంచి ఫిష్టల్ 'ట్రిగ్గర్' నొక్కాడు. 'ఢాం'మని పేలింది. మరి రెండుమార్లు నొక్కాడు ఢాం! ఢాం! జీపు నిలిచిపోయింది. జీపులోనుండి ఎవరో యిద్దరు క్రిందికి దిగారు. వాళ్ళు నిలవమని అరుస్తున్నా ఆగక వెళ్ళిపోతుంది కారు. కారు దిక్కుగా రెండు గుళ్ళు పేల్చాడు గోపి. కాని కారు ఆగకుండా వెళ్ళిపోతోంది. మళ్ళీ 'ట్రిగ్గర్' నొక్కాడు. ఊహుం, ఇక అది పేలలేదు. గుళ్ళయిపోయాయి. చేసేది లేక కారువైపు చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో కారు [illegible] ఒక జీపు వచ్చి కారు నాపేసింది.

"బాస్ ! పోలీసులు!" గట్టిగా అరచి పరుగెత్తడానికి ప్రయత్నించారు. జీపులోనుండి దిగినవారు. కాని అప్పటికే పోలీసులు తుపాకులతో చుట్టుముట్టారు. ఒక్క దొంగనుకూడా పోనివ్వకుండా పట్టుకున్నారు పోలీసులు.

*　　　*　　　*

దొంగనోట్లు అచ్చువేసినందుకూ, బియ్యం మూటలు దాచి బ్లాకులో అమ్మినందుకూ దొంగలకంతా శిక్ష వేశారు. ప్రసిద్ధి చెందిన దొంగలను పట్టించినందుకు ప్రభుత్వం పిల్లలను ప్రశంసిస్తూ బహుమతులిచ్చారు. ప్రభుత్వం తరపున డి. యస్. పి. గారు ప్రత్యేకసభ చేసి పిల్లలందరికీ బహుమతులు పంచారు. ఊర్లోనున్న వారంతా పిల్లలు పట్టిన దొంగల గూర్చే మాట్లాడుకోసాగారు.

గోపీ తాను నాటిన 'డబ్బు చెట్టు' లేచిందా, లేదా అని ఒక్కమారూ వెళ్లి చూడలేదు. లేచిందో. లేదో మరి! గోపీ మాత్రం యిప్పటికీ ఒక దొంగనోటు చూపుతూ అందరికీ తన సాహసాలు వర్ణిస్తూ వుంటాడు.

♦ —— ♦ సమాప్తము ♦ —— ♦